## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050018729

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వివేక చంద్రిక

## మొదటి భాగము

టి. ఏ. స్వామినాథయ్యరు గారిచే

APPROVED BY THE TEXT-BOOK COMMITTEE

*(Vide Fort St. George Gazette Part I-B dated 27th May 1919, page 372).*

MADRAS:

C. COOMARASAWMY NAIDU & SONS

1921

 *[Price As. 7*

# ఉపోద్ఘాతము.

బాలురను సన్మార్గ ప్రవర్తకు లగునట్లొనర్చుటకు కేవలము నీతి సూత్రము లగు వాక్యములను మాత్రము బోధింపించుటకంటె వానిని కథా రూపమున బోధించుటయే లగ్గని యనేకుల యభిమతము.

బాలురకు సన్మార్గప్రభావమును, దుర్మార్గ దూష్యమును, కథల మూలముగా బోధమగునట్లు, పద్యములవలన బోధమగుట దుష్కరము. మఱియు, మన బాలురకు శిశుప్రాయము నుండియే కథలు వినుటయం దాసక్తి మెండు. కాఁబట్టియే వారి భోజన శయనాది సమయములయం దెల్ల తల్లులు మొదలగువారు, వినోద కథలు చెప్పఁగా, వారు 'ఊఁ' కొట్టి సంతసించుచున్నారు. అట్టి యభ్యాసముతోఁ బెరిఁగిన మన బాలుర కెప్పుడును కథలు వినుట కాసక్తి మెండుగా నుండు నని వేఱె చెప్పవలసినది లేదు కదా?

నీతికథలు మన పురాణేతిహాసాదులయందు లెక్కకు మిక్కుటమై కానంబడియెడిని. అయినను, వానినంతయుఁ జదివి యందలి సారాంశముల నెఱుఁగుటకు నెట్టివారికేని చాలకాలము పట్టును. కావున, బాల్యమునుండియే బాలురకు నీతిని బోధించుట మేలనియు, 'రంగు నూతన వస్త్రమునందు పట్టినట్లు మలిన వస్త్రమునందు పట్ట' దనెడి నీతి సూత్రము ననుసరించి పురాణేతిహాసాదులలోని వివేకోత్పాదకము లగు కథలను గ్రహించి ప్రకరణము ననుసరించి కొన్ని చోటులందు విస్తరించియు కొన్నిచోటులయందు సంగ్రహించియు వ్రాసి "వివేకచంద్రిక" యని పేరిడి ముద్రించినాఁడను.

# వివేకచంద్రిక

## 1. బాల్యాభ్యాసము

నైమిశారణ్యమునందు మామిడిచెట్టు తొఱ్ఱలో నొక చిలుక రెండుగ్రుడ్లను పెట్టి పొదిగి పిల్లలుచేసి వానిని పెంచుచుండెను. ఒకనాఁడు తల్లి చిలుక ఎర తెచ్చుటకై బయటపోయి యుండెను. ఆ సమయమునం దొక బోయవాఁడు వలవైచి పొంచి యుండెను. చిలుకపిల్లలు గూఁటినుండి బయట వచ్చి, మెల్ల మెల్లగా పయి కొమ్మనుండి క్రిందికొమ్మకు దిగి యచ్చట నున్న వలలోఁ బడినవి.

2. అవి వలలోఁ బడఁగానే బోయవాఁడు వానిని పట్టి తన చిక్కములో వైచికొని పోవుచుండెను. వానిలో నొకపిల్ల, చిక్కము కొంచెము చినిఁగియుండినందున ఆ సందుగుండ వెలికివచ్చి, చప్పుడుచేయక, సమీపమం దున్న ఒక ఋష్యాశ్రమమునకు పోయి చేరెను. అచ్చట నున్న ఋషికుమారులు, ప్రాణభయముచే బరువిడి వచ్చిన చిలుకను ఆదరించి దానికి ఆహార మొసఁగుచు నుండిరి. అది అచ్చటనే పెరుఁగుచుండెను.

3. వానిలో నొకపిల్ల పాఱిపోయినదని బోయవాఁడు తెలిసికొనెను గాని దానిని మరల పట్టుకొనుటకు వలనుగాక, తన యొద్దనున్న యొక్క పిల్లను పదిలపఱచుకొని, సమీపమందున్న పట్టణమునకుఁ బోయి కటికవానికి విక్రయించెను. ఆ కటికవాఁడు చిలుకపిల్లను పంజరమున నిడి దానిని అంగడి యందు కట్టియుంచి పోషించుచుండెను. ఇట్లుండఁగా ఒకనాఁడు ఆ చిలుక, గూఁటి కమ్మి సడలియుండినందున, మెల్లగా దాఁటి చేసికొని నొక యరణ్యమును చేరెను.

4. ఆ మార్గమున వచ్చుచుండిన బ్రాహ్మణుఁ డొకఁడు, బడలికచే, ఆ చిలుకయున్న మ్రానిక్రిందఁ గూర్చుండెను. అప్పుడు చిలుక, 'నఱుకుము! కోయుము! మేఁకమాంసము ఆఱుకాసులు, కోడినంజుఁడు మూఁడుకాసులు! డబ్బిచ్చిపో, మూతిమీఁద కొట్టు, ఛీ, ఛీ, పో!' అని అఱచుచుండెను. బ్రాహ్మణుఁడు 'ఇదేమి! ఈ చిలుక యిట్టి చెడ్డమాటలు పలుకుచున్నది! ఇచ్చోట నుండుటకు యోగ్యముకాదు' అని వేఱొక మార్గముగఁ జని తటాకము గట్టునందున్న చెట్టు క్రిందఁ గూర్చుండెను.

5. ఋషుల పర్ణశాలయందు పెరిఁగిన చిలుక ఆ మ్రాని పయిఁ గూర్చుండి యుండెను. అది, క్రిందఁ గూర్చుండిన బ్రాహ్మణునిఁ జూచి, 'స్వామీ, స్వాగతము, శ్రమ పరిహారము

చేసికొనుఁడు; ఇచట తమకు భుజించుటకు వలసిన పండ్లు ఉన్నవి; భుజించి మీ క్షుద్బాధను తీర్చికొనుఁడు ; తమ దర్శన



విశేషమువలన నేను ధన్యుఁడను. "సత్యం వద, ధర్మం చర" ' అని చెప్పఁ దొడఁగినది.

6. వీనుల కింపయిన యీపలుకులను విని, బ్రాహ్మణుఁడు ఆశ్చర్యమును ఆనందమును బొంది, తల పయికెత్తి చిలుకను జూచి, 'అరగడియకు మునుపు ఒక చెట్టుక్రిందఁ గూర్చుంటిని. అందున్న చిలుక దుర్భాషలను పలికినది. దానిని సహింపక ఇక్కడికి వచ్చితిని. ఇది మనోరంజకముగా పలికి ఉపచరించుచున్నది. ఏమి ఆశ్చర్యము! ఇట్లు వీని స్వభావములు వేఱుపడి యుండుటకుఁ గారణమేమి?' అని తలపోయుచుండెను.

7. అప్పుడా చిలుక, 'స్వామీ! వినుఁడు. మేము ఇరువురమును ఒక తల్లి బిడ్డలము. బోయవానివలలోఁ బడితిమి. అదృష్టవశమున నేను తప్పించుకొని మునుల తపోవనమును జేరితిని. అది కటికవాని కమ్ముడుపోయినది. మునులు మాటలాడికొను మాటలను విని నేను నావిధమున మాటలాడుచున్నాను. కటికవాని అంగడియందు వాఁడు మాటలాడు మాటలను విని, అది ఆరీతిని మాటలాడుచున్నది. ఎవరికి ఏది వాడుకయో అదియే బయలువడును. మా గుణభేదములకుఁ గారణము పసితనమునందలి యలవాటేకాని వేఱుకాదు' అని విన్నవించెను.

8. బాల్యమందలవడినది ఎన్నఁటికిని నెలకొనియుండును. మనుష్యుఁడు మంచివాఁడుగా నుండుటకును, చెడ్డవాఁడుగా నుండుటకును గారణము పిన్నతనమందలి అలవాటే యగును.

మొదట వంకరపోయినది తుదపఱకు వంకరయే. కాఁబట్టి, పిన్నవాండ్రు బాల్యముననే యోగ్యతను అనుసరింపవలయును.

క. 'తిలలును నీళ్లును వస్త్రం
బులుఁ బువ్వుసుగంధవాసమున సౌరభముం
బొలుపెసఁగఁ దాల్చుఁ గావున
నలయక సత్సంగమమున నగు సద్గుణముల్.'

## 2. అడఁకువతో మాటలాడుము

కలియుగారంభమందు జరత్కారుఁ డనెడి మునిపుంగవుఁడు చిరకాలము గృహస్థుఁడు గాక బ్రహ్మచారిగా నుండెను. ఇతనికి సంతానము లేమిచే నీతని పితరు లందఱును నరకమందు పడవలసినవారైరి. అది తెలిసి జరత్కారుఁడు నాగరాజయిన తక్షకుని సహోదరి యగు జరత్కారువును వివాహ మయ్యెను. వారలకు అస్తీకుఁడు అను నొక కుమారుఁడు పుట్టెను. వాఁడు శుక్లపక్ష చంద్రునివలె నిత్య మొక వన్నెగాను పూఁట కొక సోముగాను పెరుఁగుచుండెను.

2. ఇట్లుండఁగా, జనమేజయుని తండ్రియగు పరీక్షిత్తు సర్పముచేఁ గఱువఁబడి మృతినొందెను. జనమేజయుఁడు కోపము నొంది లోకమునందుఁ గల సర్పముల నన్నిఁటిని నాశముసేయఁ

దలఁచి సర్పయాగము చేయఁదొడఁగెను. యాగకుండమందు అనేక సర్పములు పడి మడిసినవి.

3. ఆ యాగము నెఱవేఱినయెడల సర్పవంశము సంపూర్ణముగా నశించిపోవునే యని తక్షకుఁడు చింతనొంది తన మేనల్లుఁ డయిన అస్తీకునొద్దకు వచ్చి, సర్పయాగమును నిలుపునట్లు జనమేజయుని వేఁడు మనెను. అస్తీకుఁడు మేనమామ కోరిక చొప్పున జనమేజయుని యాగశాలకుఁ బోయి అతని కెదురఁ నిలువంబడి, 'మహారాజా! నీవు ధర్మిష్ఠుఁడవు; ధర్మశీలురయిన పాండవుల వంశమందు పుట్టినవాఁడవు; నీకీర్తి మూఁడు లోకములయందును వ్యాపించియున్నది; పరోపకార చింతతో దీనుల కష్టములను దొలఁగించువాఁడవు; నీయాగము ఇంద్రుని నూఱు యాగములతో సమాన మైనది; దేవతలును బ్రాహ్మణులును తృప్తినొందిరి. లోకమునందు పరోపకారమునకంటె మేలైన ధర్మము లేదు; నీతిమంతుఁడ వయిన నీకును నీ ప్రజలకును శుభము కలుగుఁగాత' అని ఆశీర్వదించెను.

4. సుందరాకారము గల యా ఋషి కుమారుఁడు శాంతముతో, వీనులకింపుగాఁ బలికినందున జనమేజయ మహారాజు సంతోషించి, 'అయ్యా, నీ మాటలు విని నీయందు ప్రీతి హెచ్చినది. నీకు వలసినదాని నడుగుము' అనెను.

5. అస్తీకుఁడు, 'మహారాజా! ఈ సర్పయాగము ఇంతటితో ముగియవలయునని నా ప్రార్థన' అనెను. రాజు 'నీ

మాటచొప్పుననే చేసెదను' అని చెప్పి యాగమును నిలిపెను. అచట నున్న వారిలో కొందఱు, 'యాగము ను అవభృథాంతము గాకపూర్వము నిలుపుటవలన దోషము కలుగును' అని చెప్పిరి. జనమేజయ మహారాజు వారి యాక్షేపములను సరకు సేయక ఋషికుమారునకుఁ దాఁ జేసిన ప్రతిజ్ఞను నెఱవేర్చెను. ఇట్లు సర్పయాగము ముగిసినందున, శేషించియుండిన సర్పము లన్నియు బ్రతికినవి. సర్పరాజయిన తక్షకుని కోరికయు నెఱ వేఱినది.

6. తక్షకుని కోరిక నెఱవేఱుటకు అస్తీకుని శాంతమైన మాటలే కారణము. జనమేజయ మహారాజు మిక్కిలి కుపితుఁడై ఆగ్రహించి సర్పములను నాశము సేయుచుండఁగా, ఆ కార్యము నిలుపునట్లు చేయుట సాధ్య మగునా? అది అసాధ్యమే యని యెల్లవారు నెఱుఁగుదురు. అట్టి కార్యమును సయితము మృదు భాషణముచే సాధింప నయ్యె నని యీ కథ తెలుపుచున్నది. కావున, బాలురు ఇంపయిన మాటలాడుటకు వాడుక చేయుదురుగాక.

క. 'మనమునకు హితంబును బ్రియ
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగ బలుకునది ధర్మయుతముగ సభలన్.'

———

## 3. వ్యర్థమైన మాటలు విడువు

మధురానగరమున వేదరాశి అను బ్రాహ్మణుఁడొక డుండెను. అతనికి చంద్రరేఖ యనెడి పేరు గల భార్య గలదు. ఆమె చక్కఁదనమును, దానికిఁ దగిన గుణమును గల పతివ్రతయై యుండెను. మఱియు, భర్తకు నిత్యనైమిత్తికాది వైదిక కార్యములకు తోడ్పడుచుండెను. అయినను, తీఱిక గల సమయమున ఎవ్వరితోడఁగాని ఉబుసుపోకకు వ్యర్థమైన మాటలాడు చుండును.

2. పొరుగింట నున్న కమల యను యువతి ప్రతిదినము చంద్రరేఖ యింటికి వచ్చుచుండెను. చంద్రరేఖ తన పని యంతయు విడిచిపెట్టి కమలతో వ్యర్థమైన మాటలాడును. నానాట ఈ వాడుక అధికమయ్యెను. చంద్రరేఖను దుర్మార్గమునందు ప్రేరేప నెంచి కమల ఒకనాడు అక్రమములయిన మాటలను కొన్నిటిని చేర్చి చెప్పెను. ప్రొద్దు పుచ్చుటకు మాటలాడు వారు దొరకిన చాలునని తలఁచుచున్న చంద్రరేఖ యిట్లు చెప్పవలదని ఆక్షేపింపక ఊరకుండెను. అదిమొదలు కమల చెడ్డమాటల నధికము చెప్పఁ దొడఁగెను. కొన్నాళ్లకు చంద్రరేఖకు చెడు నడవడికలు పట్టుపడినవి.

3. ఇట్లు కొఱగాని మాటలచేఁ గలిగిన దుర్బుద్ధివలన, చంద్రరేఖ పొరుగువారి వస్తువులకు ఆశపడి, పొరుగిండ్లకు

పోవునపుడు చేతికిఁ జిక్కిన పదార్థములను దొంగిలించుకొని వచ్చుచుండెను. తమతమ యిండ్లలోఁ గనఁబడని వస్తువులను చంద్రరేఖ దొంగిలియుండు నని అనుమానింపఁ దొడఁగిరి. అట్లే ఆ వస్తువులలోఁ గొన్ని ఆమె యింట కనఁబడినవి; ఆమె దొంగతనము బయలుపడెను.

4. పెసిమిటియగు వేదరాశి, తనభార్యయొక్క చెడ్డ నడవడికల నెఱింగి, చంద్రరేఖను ఇంటనుండి తఱుమఁగొట్టెను. చంద్రరేఖ దుర్బుద్ధి మానలేదు. కడపట, కట్టగుడ్డయు త్రాగ గంజియు లేక, యెల్లవారిచే చీవాట్లు తిని, దిక్కుమాలినదై ఒక యడవియందు చచ్చెను. మఱికొన్ని దినములకుఁ గిమ్మట కవలకును ఆ గతియే సంభవించెను.

5. మంచి యలవాటు పనుపడియుండిన చంద్రరేఖ, అక్రమమైన మాటలచే దుర్నీతికి లోనై దుఃఖము నొందెను. కాఁబట్టి, వ్యర్థమైన మాటలాడరాదు. అట్టి మాటలను వినుట కూడ తగదు.

క. 'ఎదిరికి హితమును నిజమును
మదికింపును గాఁగ బలుకు మాటల దిక్కై
యొదవినను లెస్స యటు గా
కిది యది యని యూరకుంట యొంతయునొప్పన్.'

## 4. పరిహాసింపకుము

రావణుఁడు చిరకాలము బ్రహ్మదేవుని గుఱించి తపము చేసి అతనివలన ననేకములైన వరములను పొందెను. వాఁడా వరబలముచే మిక్కిలి గర్వమునొంది దిగ్విజయము* సేయ బయలువెడలెను.

2. ఇట్లు చని దేవతలను కిన్నర కింపురుషాదులను గెలిచెను. మఱి కొన్ని దినములకు ఏళ్లు, కొలఁకులు, చెఱువులు మొదలైనవానిని పాడుచేసెను; అక్కడక్కడ గల జనులను పీడించెను; గ్రామములను పట్టణములను అగ్ని కాహుతి చేసెను; తన యన్న యగు కుబేరునిమీఁదికి దండెత్తిపోయి అతని పుష్పక విమానమును గైకొనెను.

3. వాఁడు విమానము నధిరోహించి ఆకాశ మార్గముగా ప్రయాణము చేసెను. కొంత దూరము పోయినపిదప ఆ విమానము కదలక మెదలక నిలచిపోయెను. అది నిలచుటకు కారణ మేమని తనతోఁగూడ నున్న మారీచు నడిగెను. మారీచుఁడు, 'ఇది కుబేరునికిఁ దప్ప తక్కినవారికి పోనేరదని తోఁచుచున్నది. వేఱుకారణము కనఁబడ లేదు' అనెను.

* దిగ్విజయ మనఁగా ఒక్కొక్క దిక్కునకు దండయాత్ర వెడలి యెదిరించినవారిని గెలుచుట.

4. ఇట్లు వీరిద్దరును మాటలాడుకొనుచుండఁగా పరమేశ్వరుని భృత్యుఁడయిన నందీశ్వరుఁడు, అచ్చటికి వచ్చి రావణునిఁ జూచి, 'ఇది కైలాసగిరి; బ్రహ్మాది దేవతలుకూడ శివుని అనుమతిలేక దీని మీఁదుగా పోనేరరు. కాఁబట్టి, నీవు వెనుకకు మరలిపొమ్ము. పోనిచో చెడఁగలవు' అనెను.

5. అంత దశగ్రీవుఁడు, శంకరుని రెండవ రూపమయిన నందిదేవునిఁ జూచి, 'ఈ కోఁతి ఎక్కడిది? ఎక్కడనుండి యిక్కడికి వచ్చినది? దీని మూతి ఒక మూరెఁడు నిడివిగా నున్నది. దీని తలమీఁద కొమ్ములున్నవి. ఈ ద్వీపాంతర వానరము ను ఇక్కడికి తెచ్చి విడిచినవా రెవరు?' అని తనంతట ఎలుగెత్తి చెప్పి పండ్లు పటపట కొఱికి చుఱచుఱ చూచి పరిహాసము చేసెను.

6. నంది, రావణుని దుష్టచేష్టలను గాంచి, 'ఓరి దురాత్మా! నీవెంత? నీ పరాక్రమ మెంత? నీ దుర్మార్గము చేతనే నీవు సమూలముగా నశింపఁగలవు. నన్ను కోఁతి వని పరిహాసము చేసితివి; కాఁబట్టి, నీయూరును పేరును సొంపును పెంపును వాసియు వన్నెయు కోఁతివలననే నాశమొందును గాక. కావున, నిన్ను చంపక విడిచెద' నని శపించెను.

7. రావణుఁడు నందిదేవుని శాపమును పొంది, వచ్చిన దారిని మరలిపోయెను. పిదప, ఆంజనేయుఁడు మొదలగు వానరులచేతనే వానికిని, వాని నగరమునకును, వాని కులము

నకును ఎంత నాశము సంభవించెనో యది రామాయణ కథ నెఱిఁగినవారి కందఱకును దెలియును. ఈ చెఱుగునకుఁ గారణము, మహామహుఁడగు నందిదేవుని పరిహాసము చేసినదే.

8. పరిహాసము చేయుటవలన పెక్కు చెడుగులు కలుగునని ఈ కథవలనఁ దెలియనగు. మఱియు, పెద్దలయెదుట చిటికలు వేయుట, ఈలవేయుట, చేతులు చఱచి నవ్వుట, బెదరించుట మొదలయినవి చేయఁదగని పనులని తెలివిగలవారు తెలిసికొందురుగాక.

క. 'తగునిది తగదని పదిలో
వగవక సాధులకుఁ బెఱవారికి నెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్.'

## తలిదండ్రుల కణఁగియుండుట

త్రేతాయుగమునందు అయోధ్యానగరమునకుఁ బ్రభువయిన దశరథ మహారాజు చిరకాలము ధర్మముగా రాజ్యము నేలుచు సకలసౌఖ్యముల ననుభవించుచుండెను. అతనికి దేవుని కృపవలన, జ్యేష్ఠ భార్యయైన కౌసల్యాదేవికి శ్రీరాముఁడును, రెండవ భార్య యగు కైకేయికి భరతుఁడును, మూఁడవభార్యయైన సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును పుట్టిరి.

2. ఈ నలువురలో శ్రీరాముఁడు మిక్కిలి గుణవంతుఁడై వృద్ధినొందుచు సకల విద్యలను కఱచుచుండెను; మఱియు, విశ్వామిత్ర మహర్షితో వనమున కేగి, అతనియొద్ద ననేక విద్యలను మంత్ర శాస్త్రములను గ్రహించి తాటక మొదలైనవారిని జంపెను. పిదప, మిథిలా నగరంబునకుఁ బోయి సీతాదేవిని స్వయంవరమున వరించి రాజధానికి వచ్చెను.

3. అనంతరము దశరథుఁడు సకల విషయములందును సమర్థుఁడును జ్యేష్ఠపుత్రుఁడు నైన శ్రీరామునికి పట్టాభిషేకము చేసి, రాజ్య నాతని కప్పగించి, తాను విశ్రాంతి నొంది యుండ వలయు నని నిశ్చయించెను. ఆ సమయమందు దశరథుని రెండవ భార్య యగు కైకేయి మంథర యను దాసి దుర్బోధనను విని, రాజుకడకు వచ్చి, 'నాకు కావలసినప్పుడు రెండు వరముల నిచ్చునట్లు మాట యిచ్చియున్నారు గదా? ఆ రెండు వరములను ఇప్పు డొసఁగ వలయును' అని యడిగెను.

4. దశరథుఁడు తా నాడినమాట నెఱవేర్పవలసినది ధర్మ మని తలఁచి, యామెను గాంచి, 'నీకు వలసిన వరములను వేఁడుము' అనెను. అంత కైకేయి, 'రాముని అడవికి పంపుట, భరతునికి పట్టాభిషేకము చేయుట, అను నీ రెండు వరము లొసఁగవలయును. ఇయ్యనియెడల ప్రాణమును త్యజింతును' అని చలముపట్టెను.

5. దశరథుఁడు పిడుగువంటి వార్తలను విని, మిక్కిలి సంకటపడి మూర్ఛిల్లెను. ఈ వృత్తాంతము శ్రీరామునకుఁ దెలియఁగానే అతఁడు తండ్రియొద్దకుఁ బోయి అతనిం జూచి, 'తమ ప్రతిజ్ఞకు లోపము రాకుండునట్లు చేయుఁడు' అని ప్రార్థించెను. దశరథుఁడు బదులు చెప్పుటకు నోరాడక ప్రామ్నడి నిట్టూర్పు పుచ్చుచుండెను. ధర్మ సంకటమునఁ దగిలియున్న తండ్రి మనోస్థితిని దెలిసికొని రాముఁడు తన భార్య అగు సీతను, తమ్ముఁడగు లక్ష్మణుని వెంటఁబెట్టుకొని తండ్రిమాటకు భంగము రాకుండునట్లు నడచుకొనుచున్నాఁడను సదా యనెడి సంతోషముతో వనమునకుఁ బోయెను.

6. లోకమున తమ సుఖమును త్యజించి, పెద్దల మేలు కొఱకు, శ్రీరామునివలె చేయువారు అరుదు. తలిదండ్రుల యభిప్రాయము నొప్పన బిడ్డలు నడచుకొనవలయు ననుటయే ఈ కథకు తాత్పర్యము.

7. ఎంత ఉన్నతపదవి నొందినను, తండ్రియానతి మేరకు వర్తింప వలయును. తండ్రియాజ్ఞయే తనయునకు మహా భూషణము.

క. 'జననీ జనకుల విప్రులఁ
దనయులఁ గురు వృద్ధ సాధు దారాదుల నే
జనుఁడు ఘనుఁడయ్యుఁ బ్రోవక
వనరును జీవన్మృతుండు వాఁడె ధరిత్రిన్.'

## 6. తలిదండ్రుల కణఁగియుండుట - II

ద్వాపరయుగమున చంద్రవంశమునందు పుట్టిన యయాతి మహారాజు సుఖముగా రాజ్యపాలనము చేయుచుండెను. అతనికి అయిదుగురు కుమారులు గలరు. అతఁడు చాలకాలము ఇహలోకసౌఖ్యముల ననుభవించుచుండి వార్ధకదశను బొందెను. అయినను అతనికి ఈ లోకసౌఖ్యము లనుభవించినది చాలుననెడి తలంపుమాత్రము కలుగలేదు.

2. కావున, అతఁ డొకనాఁడు తన పెద్ద కుమారుఁడైన యదురాయనిఁ బిలిచి, 'కుమారుఁడా! ఇప్పుడు నాకు ముదిమి సంభవించినది. అందువలన ఇష్టభోగముల ననుభవింపలేకున్నాఁడను. ఇంతకాలము సుఖ మనుభవించియు తృప్తికలుగకున్నది; ఇంకను కొంతకాలము అనుభవింపవలయు ననెడి కోరిక బాధించుచున్నది. దానిని అనుభవించుటకు యౌవనదశ ఆవశ్యకము. కాఁబట్టి, నీవు నీయౌవనమును కొన్నాళ్లు నాకొసఁగి నాముదిమిని నీవు గ్రహించెదవా ?' అని యడిగెను.

3. యదురాయఁడు తండ్రిమాటలను అంగీకరింపక, 'నాసుఖప్రదమైన యౌవనమును నీకిచ్చి నీముదిమిని నేను గైకొనుటకు సమ్మతింపను' అనెను. అంత యయాతి కుపితుఁడై 'ఓరి దురాత్మా! తలిదండ్రుల మాటలను వినుటకంటె

పుత్త్రులకు మేలైన ధర్మము వేఱేదికలదు? తలిదండ్రులను దైవ మని తలఁపక అడ్డుమాట చెప్పితివి, నీవును నీవంశము వారును మూఢులై రాజ్యకాంక్ష లేనివారై పోవుదురు గాక' అని శపించెను.

4. ఇట్లే తక్కిన మువ్వురుకొడుకులను రావించి యడిగెను. వారును పెద్దకుమారునివలెనే తన యౌవనము నొసఁగుటకు సమ్మతింపనందున వారికిని శాపమొసఁగెను. అనంతరము అందఱకును కనిష్ఠుఁడైన పురు వనువానిం బిలిచి యడుగ, వాఁడు తండ్రియాజ్ఞను తలదాల్చి తపోమహిమచే తన యౌవనమును తండ్రికిచ్చి, అతని వార్ధకమును తాను గైకొనెను. అది మొదలు యయాతిమహారాజు యౌవన బలముచేత చాల కాలము ఇహలోక సౌఖ్యముల ననుభవించుచు సంతోషముగఁ గాలము కడపుచుండెను.

5. ఇట్లు వెక్కేండ్లు చనినపిమ్మట, పురువును బిలిచి 'కుమారా! నీ వినయమునకు నేను చాల మెచ్చితి. నీ వొసంగిన యౌవనముచే ననేకములైన సౌఖ్యముల ననుభవించితిని. అయినను, ఈలోకమునందు ఎంతకాలము సుఖభోగము లనుభవించినప్పటికిని, తృప్తిమాత్రము కలుగుట లేదు. జ్ఞానమును బడసి దేవుని నుతించుటవలనఁ గలుగు సౌఖ్యమే శాశ్వతమైనది. కావున, నీవు నీ యౌవనమును గైకొని నా వార్ధకమును నాకొసంగుము' అని చెప్పి, తన

వార్ధకమును గైకొని యౌవనముతోఁగూడ రాజ్యమును వాని కిచ్చెను. పిమ్మట, యయాతిమహారాజు భార్యతోఁగూడ వనంబునకుఁ జని తపంబు సేయుచుండెను.

6. తల్లిదండ్రులమాటను జవదాఁటని పుత్త్రులే ధర్మశీలు రనఁబడుదురు. తల్లిదండ్రుల యిష్టానుసారముగ వర్తించువారే బిడ్డలు, తక్కినవారు ఎడ్డెలు. కన్నవారు మనకు పెద్దలగుటంబట్టి వారిని గురువులనియు దేవతలనియు తలంపవలయును.

క. చెల్లుబడిఁ గలిగి యెవ్వఁడు
తల్లికిఁ దండ్రికిని దేహధనములు వృత్తుల్
చెల్లింపఁ డట్టి కష్టుఁడు
ప్రల్లదుఁ డా మీఁద నాత్మ పలలాశి యగున్.

## 7. కపటము కూడదు

శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతోఁ గూడి వనంబునకుఁ జని పర్ణశాలను నిర్మించుకొని యందు వసించుచుండెను.

2. లంకాధిపతియగు రావణుండు సీతాదేవి సౌందర్యాతిశయమును విని మక్కువ గొని యామెను గైకొని చనుటకుఁ బ్రయత్నము చేసెను. శ్రీరాముఁ డుండు సమయమున సీతా

దేవిని గైకొనిపోవుటకు సాధ్యముగాదనియు, శ్రీరాముని సీతను విడఁబాటుజేసి కార్యమును సాధింపవలయుననియు నీచుఁ డగు రావణుఁడు తలంచెను.

3. ఇందులకై తనమామ యగు మారీచుని రప్పించి తాఁ దలంచిన కార్యము నెఱవేఱుటకుం దగిన యుపాయము నాలోచించి చెప్పవలయు నని ప్రార్థించెను. మారీచుఁడు పర స్త్రీని గ్రహించుట పాతక మనియు, రామునియెడఁ గపటోపాయము పనికిరాదనియు, ఇట్టి దుర్మార్గమునందుఁ బ్రవేశించుట మేలుగా దనియు నొక్కి వక్కాణించెను. మారీచుఁ డెన్నివిధములుగాఁ జెప్పినప్పటికిని వాఁడు వినఁడయ్యె. అంత మారీచుఁడు, విచిత్రమగు సువర్ణమయమైన జింకరూపముఁ దాల్చి శ్రీరాముఁడున్న వనంబునకుఁ జని, సీతాదేవి యెదుట పలుతెఱంగుల దుముకుచు ఎగురుచు విహరించుచుండెను.

4. సీతాదేవి ఆ జింకనుజూచి ఆశ్చర్యమొంది దానిని ప్రాణముతోఁ బట్టియిమ్మని శ్రీరామునిఁ బ్రార్థించెను. శ్రీరాముఁడు, "అది మాయామృగమగ నుంకును, దానిని కోరకుము" అని చెప్పెను. సీత వినక ఆ విచిత్రమైన జింకను బట్టియిమ్మని పలువిధముల వేఁడెను. పిమ్మట, రాముఁడు "సీతను జాగ్రత్తతోఁ గాపాడుచుండుము" అని లక్ష్మణున కానతిచ్చి తాను విల్లునమ్ములు గైకొని జింకను బట్టుటకై పోయెను.

5. ఆ జింక చేతికిఁ జిక్కక మెల్లమెల్లగా పోవుచుండెను. శ్రీరాముఁడు దానిని వెన్నంటి చాలదూరము తరుముచుఁ బోయి, తుద కది మాయామృగమని నిశ్చయించి బాణముతోఁ గొట్టెను. అప్పు డా మాయామృగరూపముఁ దాల్చియున్న మారీచుఁడు, సీతాదేవిని సంరక్షించుచుండు లక్ష్మణునిఁగూడ అచ్చోట నుండనీక చేసినచో రావణునికోరిక నెఱవేఱు నని భావించి 'లక్ష్మణా! లక్ష్మణా!' అని యఱచుచు నేలఁ గూలెను.

6. నిష్కాపట్య హృదయముగల సీతాదేవి ఆశబ్దమును విని, శ్రీరామున కేదియో అపాయము సంభవించినందుననే తమ్ముని బిలిచియుండు నని భావించి, లక్ష్మణుని శ్రీరాముని కడకుఁ బొమ్మని బలవంతము చేసెను. లక్ష్మణుండు తాను జనునప్పుడు, సీతను పర్ణశాలదాఁటి చనవల దని చెప్పి, శ్రీరాముని వెదకుచుఁ బోయెను.

7. లక్ష్మణుఁడు వెడలిపోయినంత రావణుఁడు సన్న్యాసి వేషముఁదాల్చి సీతాదేవియున్న పర్ణశాలకేగి భిక్ష మడిగెను. రావణుని మోసము నెఱుంగని సీతాదేవి అతిథిపూజ చేయుటయే ధర్మ మనిభావించి భిక్ష మిడెను. రావణుండు వెంటనే ఆమెను తన రథంబుపై నిడికొని లంకానగరంబునకుఁ బోయెను. కపటోపాయముచే మారీచుఁడు సీతారాములకు వియోగము కలిగించినందున వాఁడు మడిసినదేగాక, రావణుఁడును కపట

సన్న్యాసియై రాముని ధర్మపత్నిని పరమసాధ్విని సీతాదేవిని అపహరించినందున శ్రీరాముఁడు వానిని దనబాణంబునకు ఆహుతి చేసి, వానికులమును సయితము నిర్మూలించెను.

8. కపటముగాఁ బ్రవర్తించువారికి తప్పక కీడు కల్గునని యీ కథవలన వేద్య మయ్యెడిని.

క. తగునిది తగదని యెదలో
వగవక సాదులకుఁ జేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు లైన భయంబుల్.

## 8. అజాగ్రత్త కూడదు

---

కుబేరుఁ డనువాఁడు అష్టదిక్పాలకులలో నొక్కరుఁడు; అతఁడే ధనాధిపతి, అతని విమానము పుష్పక మనఁబడును. ఆయన సేనాధిపతి మణిమంతుఁడు.

2. ఒక్కనాఁడు కుబేరుఁడును మణిమంతుఁడును పుష్పకారూఢులై ఆకాశమార్గమునఁ బోవుచుండిరి. ఇట్లు పోవునపుడు మణిమంతుఁడు భూలోకమునం దెక్కడ యెమహాను భావుఁడుండునో, ఏ పుణ్యతీర్థము కలదో, ఏ దివ్యస్థలముండునో యని యాలోచింపక లటాలున నుమిసెను.

3. ఇట్లు మణిమంతుఁడు ఎంతయు నాలోచింపక అజాగ్రత్తగా భూమియం దుమియఁగా నాయెంగిలి అచ్చట తపస్సు చేయుచున్న మహాత్ముని తలపైఁ బడెను. వెంటనే ఆ తపస్వి



యాకాశమువైపు చూచి, తన తలపైనుమిసినవాఁడు మణిమంతుఁడని తెలిసికొనెను.

4. ఆయన వానిం గాంచి, "మణిమంతా! ఇట్టి అకార్యము చేయఁ దగునా? ఏకార్యము నైనను ఆలోచించి జాగ్రత్తతోఁ జేయవలదా? 'అవసరపడరాదు' అనెడి నీతి వాక్యమును మఱచితివా? నీతిశాస్త్రము చెప్పిన సకలజనులును వర్తింపవలయు ననుట యటుండ, మహోన్నత పదవి యం దుండువారును సంపన్నులును శాస్త్రోల్లంఘనము చేయ రాదుకదా? కావున, ముందు వెనుకల నాలోచింపక అజాగ్రత్తగా నాతలపై నెంగిలి నుమిసిన దోషమునకు ఫలముగా నీవు నీ సైన్యము వారితోఁ గూడ నొక మనుష్యమాత్రునివలన నాశ మొందుదువుగాక" అని శపియించెను.

5. పదంపడి, అమ్ముని కుబేరునిఁ జూచి, "నీసేనాధ్యక్షుఁడు ధన మదముచేత మన్ను మిన్నెఱుఁగక యుమియు నప్పుడు నీవు వానిని వారింపక యూరకుంటివి. ఈదోషమునకై నీతోఁ జేరినవా రొక మనుజునిచేతిలోఁ బడి నశించునట్టి దుఃఖమును నీ వనుభవింతువుగాక" అని శాపమిచ్చి, 'దండార్హులను దండింపమి ధర్మము గాదు' అని వచించెను.

6. ఆ తపోత్తముని శాపముచొప్పుననే అనంతర మొక సమయమునందు కుబేరుఁడు భీమసేనుని వలన తన పరివారముతోఁగూడ పరాజయ మొంది అవమానితుఁ డాయెను.

7. ఏకార్యము నైనను అజాగ్రత్తతోఁ జేసిన యెడల కీడు కలుగు నని యీ చరిత్రమువలన విశదమయ్యెడిని. కావున,

నొక్కకరును తాము చేయుకార్యములను పరులకు క్లేశము కలిగింపని విధమునఁ జేయవలయును. ధూమశకటము (రైలు) నందుగాని ఇతరములైన శకటములయందుగాని పోవువారును, సౌధములయందు నివసించువారును మణిమంతునికిఁ గలిగిన కీడును జ్ఞప్తియందుంచుకొని జాగ్రత్తతో ప్రవర్తింపవలయును.

## 9. సహోదర ప్రేమ

శ్రీరామునకును రావణునకును సీతాపహరణార్థమై జరిగిన యుద్ధమునందు, రావణుఁడు శ్రీరాముని తమ్ముఁడైన లక్ష్మణునిపై అష్టఘంటాశక్తి యను మహాయుధమునఁ బ్రయోగించినాఁడు. అంత లక్ష్మణుండు మైమఱచి నేలఁబడి సొమ్మసిల్లెను.

2. ఆ సమయంబున శ్రీరాముఁడు మూర్ఛితుఁడై నేలం బడియున్న లక్ష్మణునిఁ గాంచి, "హా లక్ష్మణా! నీ కీ గతి సంభవించెనే!" అని ప్రలపించుచుండి, యతఁడును నేలపై నొఱఁగెను.

3. అనంతరము సమీపమునం దున్న సుషేణునిం జూచి,—"అకటా! ఇఁక నా కీయుద్ధం బేల? నా ప్రాణంబులుండి ప్రయోజనం బేమి? సీతయున్న నేమి? ఇపుడు నా బలం బెల్ల నిష్ఫలం బయ్యె; నా ప్రాణంబునకుఁ బ్రాణం బైన

నా తమ్ముఁడు లక్ష్మణుండు పోయినపిదప నీలోకమునందు నాకు వలసిన దే మున్నది? సీతవంటి స్త్రీలు పెక్కండ్రు దొరకుదురు; తోఁబుట్టు వెక్కడ దొరకును?

శ్లో. దేశేదేశే కళత్రాణి దేశేదేశే చ బాన్ధవాః
తం తు దేశం నపశ్యామి యత్ర భ్రాతా సహోదరః.

అనఁగా, 'ఒక్కొక దేశమునందును భార్యలు దొరకుదురు; బంధువులును దొరకుదురు. అయినను, తోఁబుట్టువు దొరకు నట్టి దేశమునుమాత్రము నేను జూడలేదు'" అని చెప్పి దుఃఖించెను.

4. పదంపడి లక్ష్మణునిం జూచి, "తమ్ముఁడా! నీ శరీరం బంతయు రక్తమయం బైనదే, కట్టా! నీప్రాణంబును ఈ ద్వీపాంతరమున విడుచుటకా నీవు నాతోఁ వచ్చితివి? సౌమిత్రీ! సుమిత్ర కేమని చెప్పుదు? కౌసల్యకును కైకకును భరత శత్రుఘ్నులకును ఏమని వచియింతును? నీ ప్రాణప్రియ యగు ఊర్మిళ నిన్నుఁ గానక మేన ప్రాణంబులు ధరించి యుండునా? అయ్యో! నిన్ను వదలి నే నయోధ్య కెట్లు పోవుదును?

5. "తమ్ముఁడా! నాతోడఁబుట్టువై, నాతోఁగూడనే పెరిఁగి, నాతోఁగూడనే యడవికివచ్చి, నాతోఁగూడనే కష్టంబు లనుభవించి, మమ్ము పుత్త్రునివలె రక్షించి, మమ్ము దేవతలని

భావించి, మాకష్టములఁదీర్చి, మామనంబు లెంతయు నువ్వని విధంబున సకల శుశ్రూష లొనర్చితివి. కడకు రాక్షసాధముని యాయుధంబున కెర వైతివి. ఇఁక నే నెవ్వని సౌమిత్రీ ! లక్ష్మణా ! సౌమ్యా ! యని నోరెత్తి పిలుతును ? హా, సుకుమారా ! లక్ష్మణా ! ఒక్కమాట నాతోఁ బల్కరాదా ? నేను లక్ష్మణా యని పిలిచినంతనే చేతులు మోడ్చికొని నాకడకు వచ్చి నిలువంబడువాఁడవు కదా ? నే నిప్పుఁ డెన్నివిధంబులం బిల్చినను బలుకవైతివే ! కఠినచిత్తుండ నగు నేను నిన్నీలంకాపురికిఁ దోడ్కొనివచ్చి నీప్రాణంబులు పోయినను ఇంకను నేను జీవితుండనై యున్నాఁడను కదా ! నేను నిన్నొక క్షణమైనను వదలియుండువాఁడను గాను ; ఇఁక నే నెట్లు నిన్ను వదలి యుందును ? నేనును నీతో యమపురికి వచ్చువాఁడను” అని పలు తెఱంగుల విలపించుచుండి మరల మూర్ఛితుం డయ్యె.

6. అపుడు వైద్యవిద్యాచణుం డగు సుషేణుండు శ్రీరాము నూఱడించి, “స్వామీ! శోకింప వలదు. లక్ష్మణుండు మూర్ఛిల్లి యున్నాఁడు. నేను బ్రతికింపఁగలను. నాయొద్ద దివ్యౌషధము లున్నవి” అని పల్కి ఔషధముల నాఘ్రాణింపఁ జేసి యతని మూర్ఛనుండి మేల్కొల్పెను. లక్ష్మణుఁడు నిద్రనుండి లేచినవానిపగిది లేచినం గని, రాముఁడు మహానందసాగర మగ్నుఁడై తమ్ముని గౌఁగిలించికొని శిరంబు మూర్కొనియె.

7. లోకు లెల్లరును శ్రీ రామమూర్తినలె సోదరుల యెడ మిక్కిలి ప్రేమనుంచి వర్తింపవలయును.

క. వినుభక్తియు వెఱపుఁగలిగి
యనుజన్ములు పెద్దవాని నారాధింపన్
జనవర యతఁడుం దమ్ములఁ
గొని యాడఁగ సిరికిఁ బట్టగుదు రజ్జ్వలులై.

## 10. కాలము నతిక్రమింపరాదు—I

ఏ యే సమయములయందే యే కార్యములను జేయ వలయునో, ఆయా కార్యములను దప్పక చేయవలయును. ఇది ఇరు తెఱఁగులు. అందొకటి, ఏకాలములో నేకార్యము చేయ వలయునో వానిని ఆకాలములోనే చేయుట. రెండవది, ఏకార్య మునేవరుసను జేయవలయునో దానిని ఆవరుసప్రకారము క్రమ ముగాఁ జేయుట. అనఁగా ఏకార్యము ముందు చేయవలయును, ఏకార్యమును వెనుక చేయవలయును, అని యాలోచించి క్రమము తప్పక చేయుట.

2. నిర్ణయించినవేళలో, నిర్ణయించిన పనిని చేయుటయే "కాలము నతిక్రమింపక యుండుట" యనఁబడును. అనఁగా ఏ పనిని ఏ వేళలో ఏ క్షణములో చేయవలయునో, దానిని ఆ

వేళలో ఆక్షణములో చేయవలయును. ఇట్లు చేయుట "సామయికము" అనఁబడును. అనఁగా సమయమును అతిక్రమింపక యుండుట.

3. ఏకార్యమును ముందు చేయవలయునో, ఏ కార్యమును వెనుక చేయవలయునో, అని యెఱిఁగిచేయుట "కార్యక్రమ" మనఁబడును. అనఁగా ఏదేని కార్యము చేయునపుడు దానిని వదలిపెట్టి వేఱేకార్యమును జేయరాదు.

4. కాలమును, క్రమమును తప్పకపనిచేయుట యనెడి సద్గుణమును బాలురు అభ్యసించుటకు రెండుమార్గములు కలవు.

5. మొదటిది, బాలురు బడికి వేళ తప్పకపోవలయును. బాలురు కాలము తప్పక చేయుటకై తెలుచుగా గంట కొట్టుట కలదు. ఈవిషయమునందు బాలురు గడియారములను గంటను ఎదురుచూడరాదు. వారికి వారే గడియారముగాను గంటగాను ఉండవలయును. బడికి పోవలయునెడి చింతయు, జాగ్రత్తతో మెలంగవలయు ననెడి తలంపును గలవారై సరియైన సమయమునకు పాఠశాలకుఁ బోవలయును. తలిదండ్రులు బాలురను నిలుపకగాని పాఠశాలకుఁ బోవక యుండఁదగదు. కాల మతిక్రమించి బడికి పోవుదురేని, తక్కిన బాలుర కాలమును వ్యర్థముగాఁ బోఁగొట్టినవా రగుదురు ; మఱియు తమపాఠమునందొకభాగమును బోఁగొట్టు కొందురు. బాలు రెప్పుడును

ముందుగాఁ బోయి యుండవలయును గాని, వెనుక పోరాదు. గుఱ్ఱము బండికి ముందున్నదా, వెనుకనున్నదా, చూడుఁడు.

6. రెండవది, బాలురు బడికి క్రమముగాఁ బోవలయును. ఒకనాఁటికిఁ బోయి మఱొకనాఁటికి నిలిచి పోఁదగదు. ఒకవేళ పోయి వేఱొకవేళ పోకుండ నుండరాదు. వేళతప్పి పోవుట కంటెను క్రమముతప్పి పోవుట మిక్కిలి చెడుగు. ఏలన, కొన్ని నిమిషములు ఆలస్యమునకంటె, దినమంతయు పోకుండుట చెడుగుకదా? దినమంతయు పస్తుపడి యుండుటకంటె అర కడుపు అన్నమైన తినుట మంచిది కావున, పాఠమే చదువక యుండుటకంటె, కొంతవఱకైన పాఠము చదువుట మేలు.

7. బాలురకు అభ్యాసముచేతనే వేళతప్పకుండుటయు, క్రమముతప్పక యుండుటయు నలవడుచున్నవి. బాలురు పాఠశాలకు పదిగంటలకుఁబోయి చేరుటకంటె తొమ్మిదిన్నరగంటకే చేరుట మేలు. అరగంట సేపుతాళిపోవుట మేలైనచో అర గంటసేపు ముందుపోవుటయు మేలుగనే యుండవలయును. ఉదయమునందుఁగాని మధ్యాహ్నమునందుఁగాని పాఠశాలకుఁ బోవువారికి రెండుపూటలును పోవుట కష్టముగ నుండునా? ప్రతినిత్యమును రెండువేళలయందును క్రమముగా పోవుట సుకరమే యగును. 'కావలయునన్న కంచెలోను కాచును' అనెడి సామెతచొప్పున నేపనినైనను చేయవలసినదని పట్టు పట్టినచో చేసి ముగించవచ్చును. కాల మతిక్రమింపకయు,

క్రమముతప్పకయును పాఠశాలకుఁ బోవువారు చాలదూర మున నుండి వచ్చువారుగాఁ గానంబడియెదరు.

8. బాలురు కాలమును క్రమమును తప్పక నడుచుకొన వలయునని పాఠశాలలయందే నేర్వనియెడల, వారు పెద్దవా రైనమీఁద యోగ్యతలేనివా రనిపించుకొందురు. కాలము తప్పి పనిచేయువాఁడును, క్రమముతప్పి కార్యము చేయువాఁ డును తఱుచుగా సోమరిగ నుండును. సోమరితనము చెడుగుణ ములలో నొకటి.

9. సోమరికి ఎవ్వరును బ్రతుకుమార్గముఁ జూపనొల్లరు. పనిచేయువారు తమతమ యిష్టముచొప్పున, వేళతప్పి, పని చేయు కర్మశాలలకుఁ బోవుదురేని కర్మశాలలయందు పనులు జరుగునా? కర్మశాలాధికారి యట్టి వారియిష్టము ననుసరించి కాలక్రమము లేక, రా ననుమతి నొసంగునా? పనిచేయువారు తమయొక్క అనుకూలము ప్రకారము వచ్చునంతదాఁక యంత్ర ములను ఊరక నుంచికొని యుండవచ్చునా? అయ్యవారు వచ్చువఱకు అమావాస్య కాచి యుండునా?

కాలము మనుష్యుని అనుకూలము ననుసరించి కాఁచి యుండదు. సోమరులగు పనివాండ్రు వచ్చి పనులు చేయుటకు ప్రారంభించు నంతదనుక యంత్రములను ఊరక నుంచుటకు సాధ్యము కాదు.

10. వేళ తప్పకయుండుటయు, క్రమము తప్పక యుండుటయును అలవాటని మున్ను చెప్పఁబడినదికదా ? అవి మఱియు రెండువిషయములతో సంబంధించి యున్నవి.

11. వానిలో నొకటి యేమన, వేకువ నిద్రలేచుట. ఆలస్యముగ లేచువాఁడు తఱుచుగా నా దిన మంతయు నన్ని పనులలోను వెనుక చిక్కియే యుండును. అరగంట సేపుదనుక శయ్యపై కాలము గడపినవాఁడు ఆ దినమంతయు నా యర గంటసేపును వెదకువానివలె అల్లాడుచుండును. అయిన నేమి ప్రయోజనము ? పోయినకాలము మరలరాదు

12. వేకువ లేచుట యనఁగా ముంజామున నాలస్యము లేక పరుండుట యగుచు. ముందుగాఁ బరుండిన, ముందుగా లేవ వచ్చును.

ముందుగాఁ బరుండి ముందుగా లేచుటవలన ఆరోగ్యమును ఐశ్వర్యమును గల్గును.

మనపెద్దలు ఈ విషయమును అనుభవముచేఁ దెలిసికొని మనకు బోధించి యున్నారు.

13. రెండవ దేమన, కాలమును క్రమమును తప్పక యుండుట యనునది మంచి నడవడికను సూచించు చిహ్నముగా నున్నది. మంచి నడవడిక యనఁగా తన మేలును మాత్రమే గోరక యితరులమేలును గూడఁ గోరుచుండుట.

వేళతప్పి పనిచేయువారును, క్రమముతప్పి పని చేయువారును తమమేలును మాత్రమే గోరువారుగా నుందురు. ఇతరులకు తమవలన కీడు కల్గునని తలంపు గలవారుగ నుండురేని వారు ఎప్పుడును కాలమును క్రమమును దప్పి వర్తింపరు.

## 11. కాలము నతిక్రమింపరాదు—II

గతించిన విక్టోరియా మహారాజ్ఞి తన ఛాయాపటమును వ్రాయుటకు చిత్రకారు నొక్కని రా నాజ్ఞచేసి యుండెను. వాఁడు రాఁదగిన సమయమును సైతము చెప్పియుండెను. వాఁ డా వేళకు కొంచెము ఆలస్యముగ వచ్చినాఁడు. వాఁడు ఆలస్యముగ వచ్చినందులకుఁ గారణము వాని చేతిగడియారము తప్పుగా నుండినదని చెప్పినాఁడు "అట్లయిన, నీవు క్రొత్త గడియారమును దీసికొనవలయును. మఱియు, ఆలస్యమునకు కారణ మైనదానిని వెంటనే చక్కఁబఱచికొన వలయు" నని మహారాజ్ఞి వానికిఁ బోధించెను.

2. పాఠశాలకు వేళతప్పక పోవునట్టి బాలురను బాలికలను జక్కఁగా మూట కట్టువానితోఁ బోల్చవచ్చును. మూట గట్టుటకుఁ దెలియనివాఁడు ఒక మూటలోనుంచి కట్టుటకంటె, మూటకట్టుటకు నేర్చినవాఁడు అంతకంటె సగము వస్తువులు

చేర్చి చక్కఁగా కట్టఁగలఁడు. ఇచ్చట వేళతప్పక బడికి పోవు బాలుఁడును, బాలికయు, మూటలోఁ జేర్చి కట్టుట యనునది పని, లేక, పాఠము; వారు చేర్చుట యనఁగా బడియం దుండు కాలము. ఇదియే "మూట" యనఁబడును. ఇట్లు బాలురును బాలికలును పాఠశాల విషయమున నడుచుకొందు రేని వారు పెద్దవారైనప్పుడును ఇట్లు నడుచుకొందు రనుట నిజ మగును.

3. వేళ తప్పక పని చేయువాఁడు ఎప్పుడును కాలము గడచిపోయెనని దుఃఖింపఁడు. "ఏపనియందును కాలుగంట సేపు ముందు పడినందుననే నేను ఇంతటి కీర్తియు గౌరవమును ధనమును ఆరోగ్యమును జెందినాఁడను" అని యొకానొకరు చెప్పిరి.

4. ఏపని చేయుటయందును, పాఠములు వల్లించుట యందును బాలురు కాలము తప్పక యుండునట్లు ఆటలయందును ఉండవలయును. "క్రమమైన యాట" ఇట్టిదని వారు తెలిసికొనవలయును. "క్రమమైనయాట" యనునది న్యాయమైన నడవడిక; అనఁగా, తనవలెనే ఇతరులు నని భావించి నడచుకొనుట. దీనికి వ్యతిరేకమైనది "అక్రమమైన యాట" అనఁబడును. ఆటలాడుటకు నియమింపఁబడిన కాలమునకు పోయిచేరక, ఇతరులను మనకై కాచియుండునట్లు చేయుట క్రమమైన యాట కానేరదు.

5. లోకమునందు మన చుట్టుపట్ల నుండువానిని గమనింతుమేని మనము వేళతప్పక యుండుటకును, క్రమము తప్పక యుండుటకును నేర్చుకొనవచ్చును. సూర్యుడు ప్రతి దినమును ఉదయించి అస్తమించుచున్నాడు. రేయియు పవలును మాఱిమాఱి వచ్చుచున్నవి. ఋతువులును క్రమప్రకారముగ వచ్చుచున్నవి. గిజిగాడు అను పక్షియు, లకుముకి పక్షియును ఏచోటికి ఏకాలమునందు వచ్చిపోవునో, అదేప్రకారమా పక్షులు ప్రతి సంవత్సరమునందును ఆచోటికి ఆకాలమునందు వచ్చుచుండును. చిగుళ్లును పుష్పములును వసంత ఋతువునందును, కాయయును పండ్లును శిశిర ఋతువునందును గల్గుచున్నవి.

6. మనము పెద్దలైనప్పుడు సకల కార్యములను కాలమును క్రమమును దప్పక చేయవలయును గదా ? అట్లు చేయనిచో మన కెవ్వరును ఉద్యోగ మొసంగరు. కావున, మనము కాలమును క్రమమును అతిక్రమింప కుండుటకు బాల్యమునుండియే అభ్యసింపవలయును. జాబు లిచ్చువారు, పా లమ్మువారు, రైల్వే ఉద్యోగస్థులు, ట్రాంబండ్లవారు, పాఠశాలల ఉపాధ్యాయులు, ఇంకను తక్కుం గల ఉద్యోగస్థులును కాల నిర్ణయప్రకారము పనిచేయుచున్నారు. మఱియు టంకసాలలు, వినోదశాలలు, దేవాలయములు మొదలగునవియు నిర్ణీతమైన కాలమునందే తెఱవఁబడుచున్నవి.

7. కాల నిర్ణయ ప్రకారము మనము కార్యములు చేయుటకొఱకు మనకు సహాయకారులుగాఁ గొన్ని సాధనము లేర్పడి యున్నవి. అవి యేవియన, గడియారములు, చేతి గడియారములు, పాఠశాలలు, దేవాలయములు మొదలగువాని యందు కొట్టఁబడు పెద్దగంటలు, పాఠశాలలందును రైల్వే మొదలగు స్థానములందును దినచర్య కాలనిర్ణయపట్టికలు, కర్మశాలలయందు కొట్టఁబడు గంటలు, లేక యంత్రసాహాయ్యముచే నూదఁబడు శంఖమువంటి ధ్వనులు మొదలగునవి.

8. మనము కాలనిర్ణయము ప్రకారముగ నడుచుకొనవలయు ననుటనుగూర్చి మనపెద్దలు చెప్పిన వాక్యములు కొన్ని గలవు.

"సిద్ధం సదా సిద్ధాః"

'మనము సిద్ధముగా నుండవలయును, ఎల్లప్పుడును సిద్ధముగా నుండవలయును' అనుటయే దీని యభిప్రాయము.

"గాలి కొట్టునపుడే తూరుపాఱఁ బట్టవలెను"

అను సామెతయొక్క తాత్పర్య మేమన, "కాలమును గడపుదుమేని తర్వాత కష్టము సంభవించును" అని. గాలి వీచునపుడు ధాన్యమును తూరుపారబెట్టనియెడల పొట్టు, పొల్లు, కసపు మొదలగునవి ధాన్యమునఁ జేరియుండును. పిమ్మట, వానిని

వెలువఱచుటకు చాల కష్టపడవలయును. కాఁబట్టి కాలమును వ్యర్థపుచ్చరాదు.

గీ. దినము రాత్రియు ఋతువులు మనుజుచేయు
సుకృతమును దుష్కృతంబును జూచుచుండు
గాన నెంత రహస్యపు గార్యమైన
నొరు లెఱుఁగరు సనియెడి యూహకి తగదు.

## 12. ఆకృతినిఁ గని అలయింపరాదు

---

కృతయుగమునందు భరతమహారాజను నతఁడు ఆర్యావర్తమునంతయు నేలుచుండెను. అతఁడు మహోదాత్త, భూతదయగలవాఁడు, అహంకారములేనివాఁడు, ప్రజల క్షేమము కొఱకు పాటుపడువాఁడు, సూక్ష్మబుద్ధిగలవాఁడు, లౌకిక విద్యలయందును మహాసమర్థుఁడు. ఇట్టి సుగుణ సంపత్తిగల మహారాజు నిరంతరమును ప్రజల మేలుఁగోరి సకలజనులును తన వంటివారని తలంచి నీతితో రాజ్యము నేలుచుండెను.

2. ఇతఁడు లోకవ్యవహారములయందుఁ దగిలి యెల్ల కాలము బోఁగొట్టుట మేలు కాదనియు, భూమియందు పుట్టినదానికి ప్రయోజన మది కాదనియు, భోగభాగ్యములు కష్టపరంపరలకుఁ గారణము లగునని భావించి, రాజ్యమును

కుమారుని కప్పగించి, తాను పరమ సామ్రాజ్యము నొందఁ
గోరి వనంబునకుం జనెను.

3. పదపడి, మఱుజన్మంబునందు అతఁ డీ భరతఖండం
బునం దొక అగ్రహారంబున బ్రాహ్మణకులమునఁ బుట్టెను.
అతఁడు పుట్టినదిమొదలు కదలక మెదలక మొద్దువలె పడి
యుండినందున 'జడ భరతుఁ' డని పేరిడిరి. జడ మనఁగా కద
లని పదార్థ మని యర్థము.

4. భుజించుట కేదేని యొసంగిన భుజించును; నీళ్లిచ్చిన
త్రాగును; ఇతర సమయములయం దూరకయుండును; ఎవరి
తోడను మాటలాడఁడు; ఏపనిని చేయఁడు. తలిదండ్రులు ఇత
నిని అప్రయోజకుఁడని భావించిరి. ఇంట నే వస్తువులను గోరుట
లేదు. ఎవరిని బేర్కొనుట లేదు. కావున, జడభరతుని తను
వీధి యరుగుపైఁ గూర్చుండఁ బెట్టిరి. దారిని బోవువారు, ఇతఁ
డొక అపూర్వ వ్యక్తి యనియు, జడుఁడనియును గౌరవముగను
అగౌరవముగను చెప్పుచుండిరి.

5. జడభరతుఁడు కొన్నిదినములకు పెద్దవాఁ డాయెను.
అయినను, ఏ వ్యవహారమునందును ప్రవేశింపక సాక్షి స్వరూ
పుఁడై మౌనముదాల్చియుండెను. ఎండయు వానయు గాలియు
అగ్నియు నతని నెంతయు బాధింపనయ్యె. సర్వసంగ పరిత్యాగ
ముచేసిన తపశ్శ్రేష్ఠుఁడై యుండెను. ఇటులుండ నతనిని చేనికి
వెఱబొమ్మగా నైన నుంచుట మేలని తలంచి యచ్చటికిం గొని

పోయి యుంచిరి. అతఁడు తన మనోస్థితిని, తలిదండ్రులుగాని ఇతరులుగాని తెలిసికొనుట గిచ్చగింపరైరని నిశ్చయించి యెప్పటియట్ల మౌనముద్ర దాల్చియుండెను.

6. ఇట్లుండ, ఒకనాఁడు జనకమహారాజు కపిలముని యొద్ద సాంఖ్యశాస్త్రము నభ్యసించుఁ గోర్కెకలవాఁడై పల్లకినెక్కి జడభరతుం డున్న మార్గముగఁ బోవుచుండెను. పల్లకి మోయువారు, మిక్కిలి బలిసి కదలకమెదలక కూర్చున్న జడభరతునిఁ జూచి 'ఇతఁడు మనతోఁ గూడ పల్లకిమోచుటకుఁ దగినవాఁడు' అని భావించి యతనిని లేవదీసి పల్లకిదండె నతనిభుజమున నిడి నడపించిరి.

7. పల్లకిని మోయువారందఱును సరిగా నడచుచుండఁగా, జడభరతుఁడుమాత్రము అదివఱకు మోచినవాఁడు కానందునో, లేక, ఏదేని జంతువులు తన యడుగులుమోపుట వలన నశించునని యో, తట్టాడుచు పోవుచుండెను. అందుచేత పల్లకియందుఁ గూర్చున్న జనకమహారాజు శరీర మదర, జడభరతునిఁజూచి, "నీవేమి బక్క చిక్కినవాఁడవా? నీ కిది యొక భారమా? ఇతరులవలె నీవు నడుపవేమి?" యనెను.

8. జడభరతుఁడు, "ఇదే మంచి సమయము. ఇతఁడు తగినవాఁడు. జ్ఞానలాభమునకై పోవుచున్నాఁడు. ఇతనికి సద్బోధము చేయ నగు" అని తలంచి, జనకమహారాజును జూచి, "ప్రభూ! నీవు జ్ఞానవంతుఁడవు. నీవు చెప్పినవాక్యములను విమర్శించి చూడుము. పల్లకియందుండువాఁ డెవఁడు? దానిని

మోచువాఁ డెవఁడు? 'నేను' 'నీవు' అనుటకు హేతువైన పరబ్రహ్మ మొక్కఁడేకదా? ఈరహస్య మెఱుంగనివా రెంత కాలము శాస్త్రవిచారముచేసిన ప్రయోజన మేమి? ఎన్ని కర్మములు చేసిన ఫలమేమి? భేదభావము వారినుండి తొలఁగునా?" అనెను.

9. జనకమహారాజు భయభ్రాంతుఁడై పల్లకినుండి దిగి, జడభరతునకు సాష్టాంగప్రణామంబు లాచరించి బద్ధాంజలియై, "అజ్ఞానముచే నే నాడిన మాటలను, పల్లకిమోయువారు తమ ప్రభావం బెఱుంగక నియోగించిన మహాపచారంబును, క్షమించి రక్షింపవలయు" నని గద్గదకంఠుఁడై పరిపరివిధముల ప్రార్థించెను. అంత జడభరతుఁడు, జనకమహారాజును మన్నించి, అతఁ డెఱుంగఁదలఁచిన సాంఖ్యతత్త్వమును బోధించి పంపెను.

10. ఎవరినిగాని చూచుటకు అసహ్యముగాఁ గనఁబడి నంతమాత్రమున, వారు పనికిరాని మనుష్యు లనియును, అవి వేకు లనియును భావింపఁదగదు. ఏ పుట్టలో నేపా ముండునో ఎవ్వ రెఱుఁగుదురు? ఆకారమును జూచి అలక్ష్యముచేసి అల యింపక, వారి శ్రేష్ఠగుణమును గ్రహించుటయే సన్మార్గ లక్షణ మగును.

క. పరిగా నెన్నుదు రార్యులు
దరిద్రుని బలియునిం గృతఘ్నుని జడునిన్
దొరకొను ధర్మము కామము
పరమగతియు నర్థమునను పౌరవముఖ్యా.

# 13. అసడ్డ చేయరాదు

కృతయుగమునందు నృగచక్రవర్తియనెడి సూర్యవంశపురాజు నీతితో రాజ్యపాలనము చేయుచుండెను. అతఁడు అనేక యాగములును లెక్కలేని గోదానములును జేసెను. ఇటులుండ, బ్రహ్మశర్మ యను బ్రాహ్మణునకీయఁబడిన గోవును ఆ బ్రాహ్మణుఁడు తనయింటఁ గట్టిపెట్టెను.

2. ఒకనాఁడు ఆగోవు తప్పించికొనిపోయి నృగచక్రవర్తి పసువులమందలోఁ జేరి యుండెను. ఆ బ్రాహ్మణుఁడు తన గోవును ఊరంతట వెదకెను. ఎచ్చటను గనఁబడలేదు. అది రాజు పసువులలోఁ జేరియున్న వృత్తాంతమెవ్వరికినిఁ దెలియదు. బ్రాహ్మణుఁడుమాత్రము తనపసు వెప్పుడైనను గనఁబడు ననెడి యాశతో కనిపెట్టుకొని యుండెను.

3. ఒక్కనాఁడు నృగచక్రవర్తి, ఆ గోవునే వేఱొక బ్రాహ్మణునకు దానము చేసెను. ఆ బ్రాహ్మణుఁడు దానిని తోలికొని పోయి తనయింటఁ గట్టిపెట్టెను. ఒకప్పుడా బ్రాహ్మణునింటికి బ్రహ్మశర్మ పోయి యుండెను. అతఁడు తన పసువునుజూచి ఆశ్చర్యమొంది ఆ పశువు తనదని నిరూపించుటకై తానుంచిన పేరుపెట్టి పిలువగాఁ నది యతనియొద్దకుఁ బోయి నిలచెను.

4. అపుడు ఆ యింటిబ్రాహ్మణుఁడు, "నేను దీనిని దానముగాఁ బడసితిని" అనెను. ఆ యిర్వురును "నాది యిది" "నాది యిది" అని వాగ్వాదము చేయుచు, తుదకు నృగచక్రవర్తికడకుఁ బోయి న్యాయమును బడయ నెంచిరి.

5. ఇట్లు బ్రాహ్మణు లిర్వురును నృగచక్రవర్తి మొగసాలకడకుం జని ద్వారపాలకునితో తమరాకను చక్రవర్తి కెఱింగింపుఁ డనిరి. ద్వారపాలకుఁడు చక్రవర్తి కెఱింగించెను. అయినను, రాజు ఎంతయు సడ్డచేయక తన యంతఃపురమందే



యుండెను. అంత నా బ్రాహ్మణు లిర్వురును రాజ్యమదముచే అసడ్డతో నున్న చక్రవర్తికి రాజ్య భ్రష్ఠుఁడవు గమ్మని శాపమొసంగిరి.

6. ఎన్ని దానములు చేసిన నేమి లాభము ? నృగచక్రవర్తి అసడ్డతో నున్నందువలన బ్రాహ్మణుల శాపమునకు పాత్రుఁడైనాఁడు. బీదలని యెవరినిగాని అలక్ష్యము చేయఁదగదు. "ఇచ్చి పుచ్చుకొనుము" అను సామెత చొప్పున, కొద్దిగాని గొప్పగాని తాసీయఁగా వచ్చును. కావున, న్యాయాన్యాయములను గాని, మఱియు నే విధమైన వ్యవహారములనుగాని, అప్పటికప్పుడే తీర్చవలయును. అసడ్డ చేయరాదు. అది ముప్పునకు హేతు వగును.

క. ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కామాటలాడి యన్యులమనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ.

---

## 14. డంబము కూడదు

---

పాండవులు ద్రౌపదితోఁడ పండ్రెండేండ్లు వనవాసము చేసిన యనంతరము ఒక్క సంవత్సరము అజ్ఞాతవాసము చేయ నెంచిరి. అజ్ఞాతవాస మనఁగా, తమ్మెవ్వ రెఱుంగక యుండునట్లు దాఁగియుండుట. కాఁబట్టి, వారు తమ పూర్వనామముల వేషములను మార్చికొనవలసినవా రైరి.

2. ధర్మరాజు సన్న్యాసి వేషముతో కంకుభట్టనెడి పేరునొంది ధర్మకథలు చెప్పుచుఁ గాలము గడుప నెంచెను.

భీముఁడు వంటచేయువాఁడై వలలుఁ డనెడి పేరుతో నుండుటకు నిశ్చయించెను. అర్జునుఁడు పేడిరూపముదాల్చి బృహన్నల యను నామమునొంది రాజకన్యకల చిత్తమునకుఁ దగినట్లు పనులు చేయుచు నాట్యశాస్త్రము నేర్పుచుఁ గాలము గడపఁ దలఁచెను. నకులుఁడు దామగ్రంథి యను పేరుతో అశ్వశిక్షకుఁడై కాలమును బోగొట్టుటకు సమ్మతించెను. సహదేవుఁడు తంత్రీపాలుఁ డను నామమును వహించి పశుశిక్ష చేయుటకు సంకల్పించెను. ద్రౌపది సైరంధ్రి యనుపేరుతో రాజస్త్రీల కూడిగము చేయుచుండుటకు నిశ్చయించెను. ఇట్లు ఆన్వాసను ఏర్పాటుచేసికొని, ఒకరినొక రెడఁబాయక, అజ్ఞాతవాసము చేయుటకుఁ దగినస్థలము విరాటరాజనగర మని నిశ్చయించి, అందఱును వేషములుమార్చికొని తా మనుకొన్న విధమున, విరాటరాజగృహంబున వసించుచుండిరి. అయినను, ధర్మరాజు గోవులును వత్సములును మేఁతమేసి నీళ్లుత్రాగినమీఁద భుజించు చుండుట వాడుక.

3. ఇటులుండ, పాండవులు విరాటరాజనగరమున దాఁగి యున్నారనెడి రహస్యము కౌరవులకుఁ దెలిసినది. అంత దుర్యోధనుఁడు, "శత్రువు లగుపాండవు లచ్చట నుండుటను వెలిపుచ్చి, ఇంకను వారిని పండ్రెండేండ్లు అడవులకుఁ బంపవలయును; కావున, విరాటుని పశువులకు మేఁతలేక చేసినచో ధర్మరాజు భుజింపఁడు, అపుడు అర్జునాదు లాపశువులను

దోలికొని పోవుటకు వత్తురు" అని నిశ్చయించి, మేయుటకై పోయియున్న విరాటరాజు పశువులను చాలాదూరము తోలికొనిపోయి కట్టియుంచెను.

4. పశువులు రావలసిన వేళకు రాలేదు. దూడలు పాలులేక 'అంబా' యని యఱచుచుండినవి. పశువులు మేత గొనుటకు పూర్వము భుజింపనొల్లని వ్రతమును గైకొనియున్న ధర్మరాజు భుజింపకయుండెను. విరాటరాజు తన పశువులను దోలికొని వచ్చుటకై, సైన్యముతోఁ గూడి చనుటకు నిశ్చయించెను.

5. ఇంతలో కౌరవులు, వేఱొక దిక్కున నున్న విరాటరాజు పశువులను బట్టుకొని పోయిరి. ఈ వృత్తాంతము రాణివాసము వారికిని దెలిసెను. అప్పుడు విరాటరాజు కొడుకు ఉత్తరుఁడు తల్లి, చెల్లెలు, బృహన్నల వేషముతో నున్న అర్జునుఁడు, సైరంధ్రి వేషముతో నున్న ద్రౌపది మొదలగు వారు వినుచుండ, కుపితుఁడై యిట్లు చెప్పఁదొడఁగెను:—

6. "మన పశువులను కౌరవులు పట్టుకొనుట యన నేమి? నేనుండుటను మఱచినారు కాఁబోలు. ఈ సమయమున దిట్టరి యగు సారథి యుండునేని, కౌరవుల గర్వమును నిమిష మాత్రమున నణఁగద్రొక్కుదును. ఇది వఱకు పదునెనిమిది దినములు జగడముచేసి శత్రువులను సంహరించి యున్నాఁడను. అప్పుడున్న సారథి యిప్పు డుండెనేని, అర్జునుఁడు సైతము

వణఁకునట్లు యుద్ధము చేయుదును. నన్నెదిరించి జగడము చేయువాఁ డెవఁ డున్నాఁడు? నేను యుద్ధమునకు బయలు వెడలిన వార్తను చెవిని సోఁకునేని కౌరవపక్షములోని మహా రథికులెల్లరును పరుగెత్తవలసినదే కదా?

7. "కర్ణుని శిరంబును అరగడియలో ఖండింతును; అశ్వత్థామను కృపాచార్యుని ఒక నిమిషములో పగులిడు నట్లు చేయుదును. ద్రోణాచార్యుని కాలుసేతులను నఱికి నలు దెసల పాఱవేయుదును. ముదిగూబ యగు భీష్మాచార్యునికి ముక్కుత్రాడు తగిలించి బరబరఁ లాగికొని వచ్చి పట్టణ వాసుల కగపఱతును. తక్కినవారు నా రథవేగ ధ్వనిని విన్నంత నే ప్రాణంబులు విడువఁగలరు. అకటా! ఈ సమయమున సారథి లేకపోయినాఁడు కదా! ఏమి చేయుదును" అని అట్ట హాసముతో తన ప్రతాపము నుగ్గడించుచుండెను.

8. అపుడు బృహన్నల వేషముతో నున్న మహావీరుఁ డగు అర్జునుఁడు, ఉత్తరుని ప్రగల్భవాక్యములు విని, "వీఁడు స్త్రీలమ్రోల తన ప్రజ్ఞను ప్రకటింపుచున్నాఁడు. వీని మద మణఁచవలయును," అని నిశ్చయించి, అచ్చట సైరంధ్రిగా నున్న ద్రౌపదినిం గాంచి కనుసన్న చేసెను.

9. అంత ద్రౌపది రాజకుమారునిఁ జూచి, "ఈ బృహన్నల అర్జునునకు సారథ్యము నేర్పినది. నీవు దీనిని సార

థిగానుంచికొనుము" అన, ఉత్తరుఁడు, "ఛీ! ఈ నపుంస కునిచే నేమగును?" అని పరిహాసించెను.

10. ఉత్తరుఁడు తెలియమిచేఁ జెప్పినమాటలకు కినియక, మరల ద్రౌపది, "ఇటుల చెప్పఁదగదు. మున్ను ఖాండవ వనమును దహించిన కాలమునందు ఈమె అర్జునునకు సారథిగా నుండినది. అప్పు డతఁడు జయ మొందుటకుఁ గారణము ఈమె సారథ్యముచేతనే యని యెఱుంగుము" అనెను. ఉత్తరుఁడు, "అట్లయినచో నిప్పుడు పరీక్షింతము" అని పల్కి అర్జునుని సారథిగా నుంచికొని యుద్ధమునకు బయలుదేరి పోయెను.

11. ఉత్తరుఁడు, యుద్ధరంగంబునందు సముద్రము వలెనున్న కౌరవయోధులను జూచినంతనే,— "అయ్యయ్యో! తెలియక వచ్చితిఁ గదా? ఈ జగడము వద్దు నాయనా, ఆవులు పోయినా పోని! నాసర్వస్వము పోయినాపోని! నేను మున్ను కౌరవసైన్యమును చిత్రమునఁ జూచి యుంటిని. అందు కొంచెముగాఁ గన్పడినది; ఇక్కడ చూడఁగా సాగరమువలె నున్నది" అని దిగులు చెందినవాఁడై మైచెమర్పు వడవడ వడం కుచుఁ జెప్పెను.

12. అర్జునుఁడు, ఉత్తరుని మాటలను లక్ష్యపెట్టక రథ మును వేగముగాఁ దోలికొని పోవుచుండ, వాఁడు భయ మొంది కుయికెట్టుచు, "అయ్యో! నన్ను ప్రాణముతో వదలి పెట్టుము, నేనిట్లే పరుగిడి పోయెదను" అని బతిమాలికొనెను.

**13.** అంతఃపురమున స్త్రీల ముంగల డంబము పల్కిన ఉత్తరుని ప్రగల్భము లిప్పు డెక్కడ? కాఁబట్టి, డంబముగా పల్కుటచేఁ బ్రయోజనము లేదు. ఎప్పుడును కార్యముచే గౌరవము వచ్చునుగాని మాటలచే రాదు. 'మొఱగునట్టికుక్క కఱవదు' అను సామెత యందు తెలిఁగినదియే కదా? కనుక, డంబముచే అవమానము కలుగునని యోచించి, బాలురు అణఁకువతో వర్తింపవలయును.

గీ. తగినవేషంబు తనుఁదాన పొగడుకొనమి
నొచ్చియును గీడుపలుకమి యిచ్చి వగవ
కునికి తనకెంత గడవకయున్న బధముఁ
దప్పకుండుట నడవడి గొప్పజేయు.

## 15. ఆడినమాట తప్పరాదు—I.

కృతయుగమునందు అసుర వంశస్థుఁడైన బలిచక్రవర్తి యను నతఁడు ధర్మముతో రాజ్యపాలనము చేయుచుండెను. అతఁడు అనేక యజ్ఞయాగములు చేసి దేవేంద్రపదవి నొందెను. ఇంద్రుఁడాదిగాఁగల దేవతలు తమ పదవులను పోఁగొట్టుకొని, మిక్కిలి చింతించుచు హరిసదనమున కేగి, విష్ణుమూర్తితో తమకు సంభవించిన విపత్తును విన్నవించిరి. అప్పుడు విష్ణువు "మిమ్ము రక్షించెద" నని అభయ మిచ్చెను.

2. పదంపడి, విష్ణుమూర్తి కశ్యపునకు అదితియందు వామనుఁడై పుట్టి బ్రహ్మచారి వేషమున బలిచక్రవర్తియొద్ద కేగెను. ఆ సమయమున బలిచక్రవర్తి యాగము చేయుచుండెను. యాగకాలమునందు యాగదీక్ష వహించినవారు అతిథులకును అభ్యాగతులకును యాచకులకును కోరినవస్తువు లొసంగుచుందురు వామనమూర్తి బలినిఁజూచి, 'మూఁడడుగుల భూమి కావలయు' నని యడిగెను. అతఁడు "అటు లొసంగితిని, ధారా పూర్వకముగాఁ గైకొనుము" అనెను.

3. అపుడు, బలిచక్రవర్తి పురోహితుఁడును, త్రికాలవేదియు నగు శుక్రాచార్యుఁడు, ఇది విష్ణుమాయ యనియును, అతఁడు వామనుఁడై బలిని సురలోకమునుండి తప్పించుటకై వచ్చియున్నాఁడనియును, ఈ దానమువలన బలిచక్రవర్తి సురలోకభోగము నేఁటితో నశించుననియు నెఱింగి, బలినిఁ జూచి, "అయ్యా! నీవీ దానము చేయవలదు" అని పెక్కు భంగులఁ జెప్పెను. అయినను, బలి, "ఆడినమాట తప్పువాఁడను కాను" అని చెప్పి, వామనమూర్తినిఁ గాంచి, మూఁడడుగులభూమిని గ్రహింపఁ బ్రార్థించెను.

4. వెంటనే, వామనమూర్తి భూమియు నాకాశము నేకముగునట్లు విశ్వరూపము దాల్చి, ఒక్క యడుగును భూమియందును, వేఱొక్క యడుగును ఆకాశమందు నునిచి, 'ఇఁక

మూఁడవ యడుగు నెచ్చట నుంపవలసినది?' అని యడిగెను. అంత బలిచక్రవర్తి ఇది విష్ణుమహిమ యని యెఱింగి, మూఁడవ యడుగును తన శిరంబునం దుంపవలసిన దని ప్రార్థించెను. అట్లే భగవంతుఁడు మూఁడవ యడుగును బలి శిరంబుపైనిడి పాతాళంబున కణఁగఁద్రొక్కెను. ఆదినముతో బలిచక్రవర్తికి దేవలోక వైభవంబు లన్నియు పోయెను.

5. బాల బ్రహ్మచారికి మూఁడడుగుల భూమి నియ్య వలదని శుక్రాచార్యుఁడు చెప్పినప్పటికిని, బలిచక్రవర్తి తా నాడిన మాటను దప్పుట దోషమని భావించి, వామనమూర్తి కోరిన ప్రకార మొసంగెను.

6. ఈ కథవలన, మన కెంత కష్టము సంభవించి నప్పటికిని, పరులకు మాటయిచ్చినప్రకారము వర్తింపవలయు ననియును, ఎట్టి విషయమందును ఆడినమాట తప్పరాదనియును బోధ మయ్యెడిని.

క. వెలయఁగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్యమును నిరుగడలం
దులనిడి తూఁపఁగ సత్యము
వలనన ములునూపు గౌరవంబున పేర్మిన్.

---

# 16. ఆడినమాట తప్పరాదు—II

ఇక్ష్వాకువంశస్థుఁ డైన హరిశ్చంద్రమహారాజు అయోధ్యానగరంబును రాజధానిగాఁ జేసికొని మహాధార్మికుఁడై సత్యవాక్యపరిపాలకుఁడై ప్రజాపాలనంబుఁ జేయుచుండెను.

2. ఒక్కనాఁడు దేవలోకంబున ఇంద్ర సభయందు వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులును, తక్కుంగల సభాసదులును పరివేష్టించియుండఁగా, ఇంద్రుఁడు, "భూలోకంబున సత్యవంతు లెవరైనఁ గలరా ?" అని యడిగెను. ఋషు లొకరి మొగము నొకరు చూచుకొనుచుండిరి. అప్పుడు వసిష్ఠమహర్షి "భూలోకంబున నా శిష్యుఁడు హరిశ్చంద్రుఁ డను రాజు సత్యవంతుఁడొక్కఁ డున్నాఁడు" అనెను. వెంటనే విశ్వామిత్రముని లేచి కుపితుఁడై "హరిశ్చంద్రుఁడు అసత్యవంతుఁడు, మఱియు క్రూరుఁడు" అనెను.

3. వసిష్ఠుఁడు లేచి, "హరిశ్చంద్రుఁ డెన్నఁడును అసత్య మాడఁడు. అతఁడు అసత్యము పల్కెనేని నేను 'బ్రహ్మర్షి'యనెడి పేరును త్యజింతును" అని శపథము చేసెను. విశ్వామిత్రుఁడు, "హరిశ్చంద్రుని సత్యమునుండి మరల్పుదును గాక" యని శపథము చేసి, మహారోషముతో నచటనుండి అయోధ్యకుఁ బోయెను.

4. హరిశ్చంద్ర మహారాజు విశ్వామిత్రముని రాక నెఱింగి, ఎదుర్కొని చని పూజించి తన మందిరంబునకుఁ

దోడ్కొని వచ్చి సకలోపచారంబులొనర్చి ముకుళిత హస్తుండై నిలువంబడి, "తాపసేంద్రా! మాయందు కరుణించి మాదేశం బునకు వచ్చితిరి. తమ పాదధూళి సోఁకిన మాత్రాన మేము ధన్యుల మైతిమి; ఇఁక మా కేకొఱఁతయుఁ గలుగఁబోదు. అయినను, తా మింతదూరము కరుణతో నేఁగుదెంచిన కారణం బేమి? నాచే నగునేని నెఱవేర్చెద" నని వినయముతో ప్రార్థించెను.

5. విశ్వామిత్రుఁడు "అయ్యా! నేనొక యజ్ఞము చేయుటకు సంకల్పించినాఁడను. అందులకు అమితధనము కావలసి యున్నది" అన, హరిశ్చంద్రుఁడు, "స్వామీ! ఇట్టి సత్కార్యమున కుపయోగింపని ధనముండి యేమి? కావలసి నంత ధనమొసంగెద" ననెను.

6. విశ్వామిత్రుఁడు, "ఒకఁడు ఏనుఁగు నెక్కి ఒడిసెల రువ్విన నెంత పొడుపు పోవునో అంతపొడుగు ధనము కావల యును. అంతకుఁ దక్కువ య్యేనేని యజ్ఞము నెఱవేఱదు" అన, హరిశ్చంద్రుఁ "డట్లే యొసంగెద" నని వాగ్దత్తము చేసెను. పిమ్మట, విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని వీడ్కొని తన యాశ్రమంబునకుఁ జనియె.

7. మఱికొన్ని దినంబుల కనంతరము విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రు నొద్దకు వచ్చి, ధన మిమ్మని యడుగఁగా, నతండు తన బొక్కసములోని ధనమునంతయుఁ దెచ్చి రాసిపోసెను.

అయినను, తానొసంగెద నని చెప్పినంత ధనము లేకుండెను. అంత, హరిశ్చంద్రుఁడు విశ్వామిత్త్రునిఁ జూచి, "నా భార్యను కొమరుని విక్రయించి యైన ఋణము దీర్చెద" నని పల్కి, భార్య చంద్రమతిని, కుమారుఁడు లోహితాస్యునిఁ దోడ్కొని కాశికిఁ బోవుచుండెను. అపుడు ప్రజలెల్లరు మిక్కిలి దుఃఖించిరి. హరిశ్చంద్రుఁడు, ప్రజలతో 'వాగ్దత్తము నెఱవేర్చి వచ్చెద'నని సమాధాన వచనంబుల నూఱడించి చనుచుండెను. ఇట్లు సకలైశ్వర్యములను విడనాడి కాయక్లేశము ననుభవించుచు నట్టడవులలో నడచి పోవుచుండఁగా, విశ్వామిత్త్రుని సేవకుఁడు నక్షత్రకుఁడు మార్గమందు సైతము హరిశ్చంద్రుని వెన్నంటి 'ధన మిమ్ము, నా కాఁకలి యగుచున్నది ; అన్నము పెట్టుము, దప్పిగానున్నది ; నీళ్ళిమ్ము, నడువలేను ; వాహనము కావలెను' అని తొందరచేయుచు, కాశికిఁ బోయి చేరెను.

8. ఒక్కొకప్పుడు హరిశ్చంద్రుఁడును చంద్రమతియు తమ ముద్దుబిడ్డఁడు అన్నములేక మోము వాడియుండుటం గని మిగుల విలపింతురు. ఒక్కొక సమయమున హరిశ్చంద్రుఁడు తనభార్యకును బిడ్డకును దనవలన నింతకష్టము సంభవించెగదా యని చింతించుచుండును. చంద్రమతియు చాల ఖిన్నురాలై తమకు సంప్రాప్తంబైన కష్టంబులం దలంచి తలపోయుచుండును. నక్షత్రకుఁడు మాత్రము, త్వరగా ధనమిచ్చి పంపుమని హరిశ్చంద్రుని బాధించుచుండెను.

9. అయినను, హరిశ్చంద్రుఁడు మాత్రము సకల కష్టములకోర్చి సత్యమునందు దృష్టికలవాఁడై యుండెను గాని, విశ్వామిత్రుఁడు మాత్రము హరిశ్చంద్రుని మఱియు బాధింప నెంచి కాశి కేఁగి అతనిం జూచి, 'ఇపుడే ధన మీయవలయును, ఈయనిచో నిన్ను శపియింతును' అని మిక్కిలి క్రోధముతోఁ జెప్పెను.

10. అనంతరము, హరిశ్చంద్రుఁడు, ఆడిన మాట తప్పుట మహా దోషం బనియు, మునీంద్రుని శాపంబువడయుట ఇక్ష్వాకువంశస్థుల కపకీర్తి యనియు నూహించి భార్యను కొమరుని కాలకౌశికుఁడను విప్రునకు విక్రయించెను. అపుడు చంద్రమతీదేవి భర్తవిశ్లేషంబున కోర్వక చాల విలపించుచుండఁగా హరిశ్చంద్రుఁడు, భార్యను జూచి, "ప్రేయసీ! విలపింపకుము. లోకంబునందు సత్యంబునకుఁ గట్టువడని మనుజుఁడు మనుజుఁడు కాఁడు. సత్యమే జయము నొసంగఁ గలదు. అది లేని సకల ధర్మములును అధర్మములే యగును. మనలను దేవుఁడు రక్షింపఁ గలఁడు; దుఃఖింపకుము, శోకంబును మానుము" అని పెక్కు తెఱఁగుల సమాధానము చేసెను.

11. ఇట్లు భార్యను కుమారుని విక్రయించియు నమ్మునికీయవలసిన ధనంబు చేకుఱలేదు. పిమ్మట తానును వీరబాహువను శ్మశానవాటికాధికారి యగు నొకచండాలునకు అమ్ముడు వోయెను. ఆ వీరబాహువు, హరిశ్చంద్రుని, శ్మశానవాటికను కాచుచుండు నట్లాజ్ఞచేయఁగా రాజు సమ్మతించెను.

12. ఈ ప్రకారముగ, ఇక్ష్వాకువంశ సంభవుండును రాజాధిరాజు నగు హరిశ్చంద్రమహారాజు, రాజ్యమును భార్యను, కుమారునిఁ వదలినప్పటికిని ఎన్నియో కష్టములను బొందినప్పటికిని, 'సత్యము సర్వశ్రేయములకు మూలమనియు, లోకంబునం బడెడిపాట్లకంటె సత్యముతప్పినవా రనుభవించు నరకలోకంబున పడెడిపాట్లధికమనియు నిశ్చయించి, చండాలునకు దాసుఁడై విశ్వామిత్రునకు ధన మొసంగెను.

13. విశ్వామిత్రుఁడు, హరిశ్చంద్రుని సత్యవాక్య పరిపాలనమునకు మెచ్చి, అతని భార్యయొక్కయు, కుమారునియొక్కయు కష్టములను మాన్పి, హరిశ్చంద్రునికి మునుపటివలె రాజ్యమును, సకల సంపదలును గల్గునట్లు అనుగ్రహించెను.

14. ఎంతటి కష్టము సంభవించినను, ఆడినమాట తప్పరాదని యీ కథవలనఁ దెలియుచున్నది. సత్యముతప్పక వర్తించినందుననే కదా సత్య హరిశ్చంద్రుఁ డనెడి శాశ్వతకీర్తి కల్గెను. కాఁబట్టియే నేఁటికిని మాట తప్పనివానిని హరిశ్చంద్రుఁ డని వ్యవహరించెదము. బాలురు సత్యమునందు దృష్టికల్గి వర్తింతురేని పెద్దవారైనపుడు మిక్కిలి కీర్తి ప్రతిష్ఠలను బొందుదురు.

గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావు
ఎఱుఁగు మెల్లధర్మములకు నెందుఁబెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైనమునులు.

## 17. పరిశుద్ధము

పరిశుద్ధ మనఁగా, శరీరమును, వస్త్రములను, అట్లే తన యొక్క గృహమును, తక్కిన పనిముట్లను శుభ్రముగ నుంచి కొనుట. దీనికే శుచియనియు పేరు.

2. బాలురు తమ శరీరములను పరిశుద్ధముగా నుంచి కొనఁగలరేని, వారి వస్తువులును, అట్లే తమ పద్ధతులును పరిశుద్ధముగా నుండు నని నిర్ణయింపవచ్చును.

3. బాలురు జలదారులలోఁగాని, వాని యోరలలోఁగాని నడవరాదు; అడుసునందును, వాననీళ్ళు నిలిచియుండు పల్లములందును, బుగ్గియందును, పెంట దిబ్బలయందును నడవరాదు; బయట పోయి యింటిలోఁ బ్రవేశించుటకు పూర్వము కాళ్లుకడిగికొని ప్రవేశింప వలయును. నడవఁదగని చోట నడచుటవలన, బాలురు పాఠశాలలకును ఇండ్లకును కశ్మలములను దీసికొనిపోవువా రగుచున్నారు. ఇందువలన పరిశుద్ధముగ నుండువారికి ఆయాసమును అసహ్యమును కల్గును.

4. చెప్పులు మొదలగునవి ధరించి యుండువారు, అడుసులో నడచిపోయి ఇంటియందుఁగాని పాఠశాల మొదలగు స్థలములకుఁగాని పోవునపుడు, కడపయొద్ద వేయఁబడియుండు నారచాపమీఁదుగా చెప్పులు మొదలగువానియందుండు కశ్మలమును దుడిచివైచి, చెప్పులను దారి కడ్డముగా వదలిపెట్టక, ఒక యోరగా వదలవలయును.

5. బాలురు ప్రతినిత్యమును రెండు మూఁడు సారులైనను కాలుసేతులును, మొగమును కడిగికొని నోరు పుక్కిలింప వలయును. చేతులందు మురికి యున్న యెడల, వారు భుజించునప్పుడు చేతులందలి మురికి అన్నముతోఁ గూడ కడుపులోనికిఁ బోవును. కాలుసేతులును మొగమును కడుగుకొనక భోజనము చేయరాదు.

6. మొగము పరిశుద్ధముగా నున్నచో నితరులు చూచి సంతోషింతురు. మురికిగా నున్నచో ఏవగింతురు. ఇతరులు మనలను జూచి ఏవగించుకొనరాదు. శరీరము నంతయు పరిశుభ్రముగా నుంచుకొనవలసినది యావశ్యకమే; అయినను, మనము కాలుసేతులను, మొగమును మఱుఁగుచేయక యుంచుటవలన ఆ భాగములందు మురికి తఱుచుగాఁ జేరును. కావున, ఆ భాగములను అప్పుడప్పుడు పరిశుద్ధము చేయవలయును.

7. బాలురు మురికిగా నుండు వస్తువులను దాఁకి వాడిన మీఁద తలుపులను, బల్లలను పుస్తకములను, మఱియు, ఇంటియందును బడియందును ఉపయోగింపఁబడు ఏ వస్తువులను తాఁకకూడదు. చచ్చిన ఎలుకలు, పిల్లులు, కుక్కలు, బల్లులు, కాకులు, పిట్టలు మొదలగువానిని స్పృశింపఁ దగదు. మఱియు చచ్చిన జంతువుల నుంచికొని ఆటలాడుటయుఁ దగదు.

8. ఇంతియగాక, బిడ్డలును పెద్దలును మాటలాడు మాటలు పరిశుద్ధముగా నుండవలయును. మాటలలో మంచి

వియు చెడ్డవియు కలవు. గుణవంతులుగాని తలిదండ్రులు సాఁకెడిబిడ్డలు అశుద్ధమైన మాటల నాడుదురు. అట్టి మాటలను బాలురు చెవియొగ్గి వినఁగూడదు. మఱియు అట్టి మాటలను జ్ఞప్తియం దెంతమాత్రము నుంచికొనరాదు. కొందఱు దుర్మార్గులు గోడలలో దుర్వార్తలను వ్రాసి యుంతురు. బాలు రావార్తలను కన్నెత్తియైనను జూడరాదు. వానిని జూచినంతనే తమ మనస్సును వేఱు మంచి విషయములందుఁ బ్రవేశపెట్ట వలయును. మనము మాటలాడెడి వ్యర్థమైన మాటలన్నియు పరులకు మనోవ్యథను కల్గించును ; అందువలన మనకు ముప్పు వాటిల్లును.

9. ఆ చెడ్డ మాటలు, వరవడి (కాపి) పుస్తకము నందును, చిత్రలేఖ (డ్రాయింగు) పుస్తకమునందును ఇంకిని దొర్లబోసియుంచిన మైలకంటె, చెడ్డగ్గినవి. ఆ కఱ చూచుట కెంతటి అసహ్యముగా నుండునో, పైని చెప్పఁబడిన మాటలు అంతకంటె మనస్సునకు అసహ్యముగ నుండును.

10. అశుద్ధమైన మాటలనఁగా నేమి? బాలురు తమ తలిదండ్రుల యొద్ద చెప్పుటకువలనుపడని లజ్జాకరమైనమాటలు మంచివనియును, చెడ్డగ్గినవి యనియును దెలిసికొనుట కిది మంచిపరీక్ష.— "ఆ మాటలు తలిదండ్రులుగాని స్నేహితులు గాని వినఁదగినవా? వారు వానిని వ్యవహరించుటకు సమ్మతింతురా?" అని ఆలోచించి, వారు వినుటకును వ్యవహరించు

టకును పనికిరానిదని తెలిసినేని, అట్టి మాటలను మాటలాడ రాదు. హీనమైన వస్తువులను తాఁకుటకుఁగాని చూచుటకుఁగాని కోరకుండునట్లే, అశుద్ధమైన మాటల నాడుటకు కోరకుండ వలయును.

11. మంచి పుస్తకములయందు చెడ్డమాటలు లేవు; అట్లే మంచివారి మనస్సులందును చెడ్డమాట లుండవు.

గీ. హితము ప్రియము ప్రసన్నంబు మితము సామ
యుక్తము నగువచనము వచియింపవలయు
సభల నటు గానియట్టివచనము జిహ్వ
కాగ్ర మెనయింపఁ జన దండ్రు రార్యజనులు.

---

## 18. అహంకారము కూడదు—I

దేవతలు వసియించు లోకము దేవలోకము. ఆ లోకమునకు ప్రధాన నగరము అమరావతి యనఁబడును. దేవతలకుఁ బ్రభు వగు దేవేంద్రుఁడు అమరావతియందు వసియించి యుండును. దేవేంద్ర పదవి తపస్సుచేతను పుణ్యకర్మములచేతను యజ్ఞయాగాదులచేతను కలుగును. ఒక్కొక కాలమునం దొక్కొక్కరు తాము చేయు సత్కార్యాచరణము వలన నాపదవినిఁ బొందుదురు.

2. దేవేంద్రుని వైభవము మిక్కిలి శ్రేష్ఠమైనది. దేవేంద్రునకు ఐరావత మనెడి తెల్ల యేనుఁగును, నిక్కు వీనులు గల

ఉచ్చైశ్శ్రవ మనెడి గుఱ్ఱమును, కామధేను వను సకల వస్తువుల నొసంగు గోవును, కోరిన కోర్కెలీడేర్చు కల్పవృక్షమును, చింతించిన పదార్థము నొసంగు చింతామణి యను రత్నమును కలవు. మఱియు, అతని కొలువుకూటము సుధర్మ యనఁబడును. వాసగృహము వైజయంతమనఁబడును. ఆయనకు మేధావంతుఁడగు బృహస్పతి ఆచార్యుఁడు. ఇఁకను, చిత్రసేనాది గంధర్వులు వైణికులు. రంభాద్యప్సరసలు నృత్తగీతాదులయందు ప్రవీణలై యతనిని సంతసింపఁ జేయుచుందురు. వైద్య విద్యాపారగులైన అశ్వీదేవతలును, శిల్పియగు విశ్వకర్మయు, సారథియగు మాతలియు, కశ్యపాది మహర్షులును నిరంతరము సభ నలంకరించి యుండును. ఇంతియగాక నాలోకంబునందు మందాకిని యను దేవగంగ సర్వదా ప్రవహించుచుండును. అచ్చటఁ గలవారి మనంబుల కుల్లాసం బొనఁగూర్చు నందనవనం బత్యంత రమణీయంబై తరుగుల్మలతా శోభితంబై వివిధ మృగపక్షి సంకులంబై విహారయోగ్యంబై తనరారుచుండును.

3. ఇట్టి అతులైశ్వర్య యుక్తుండగు దేవేంద్రుండు సకల భోగంబు లనుభవించుచు తనతో సమాను లేలోకంబునందును లేరని గర్వించియుండెను. 'అహంకారము ఆపదలకు మూలము', 'ధనమున్నచోట మదముండును', అనెడి ఆర్యోక్తులాతనియెడ ప్రత్యక్షం బయ్యె.

4. దేవేంద్రుఁ డొక్కనాఁడు ఐరావతము నెక్కి మహాట్టహాసముతోఁ బోవుచుండెను. ఆ సమయంబున దూర్వాస మహర్షి కైలాసంబునుండి శివప్రసాదం బైన పుష్ప



హారమును గైకొని వచ్చుచుండెను. అతఁడు తాఁ దెచ్చిన హారమును దేవేంద్రుని కొసంగ, దేవేంద్రుం డద్దానిని శివప్రసాద

మనిగాని, మహర్షి యొసంగిన మహాప్రసాదం బనిగాని భావించి శిరంబునం దాల్పక తా నెక్కియున్న తెల్ల యేనుఁగు కుంభ స్థలంబుపై పడవైచెను.

5. ఆహా! ధనమదంబుచే మన్ను మిన్నెఱుఁగక తన సంపదయు తన భోగంబును తనకు శాశ్వత మని యహంక రించిన వాఁ డగుటంబట్టి దేవేంద్రుఁ డా దివ్యహార ప్రభావం బెఱుంగకయు, ఇఁక నెవ్వరివలన నేమికావలయు ననియు తలంచి కాఁబోలు ఆ హారమును నిర్లక్ష్యముగా నేనుఁగుపై నుంచినాఁడు.

6. ఏనుఁగునకు శివప్రసాదమైన పుష్పమాలికా ప్రభా వంబేమి తెలియును? దానిని తన తొండముతో లాగి నేలం బడవైచి కాలితో రాచెను. ఎవ రిచ్చిన వస్తువునుగాని, వారి కన్నుల యెదుటనే పాఱవైచినచో ఇచ్చినవారికి నాగ్రహము రాక మానునా? ఈ దూర్వాసమహాఋషి ఋషులలో నధిక కోపము గలవాఁ డని ప్రసిద్ధి నొందినవాఁడు. అతఁడు దేవేం ద్రుని చేష్టను గాంచి కుపితుఁడై కన్ను లెఱ్ఱజేసి పటపట పండ్లు కొఱికి యిట్లనియె:

7. 'దేవేంద్రా! "ధనమెచ్చిన మద మెచ్చును, మద మెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చుఁ" అను వాక్యము చొప్పున, అల్పుఁడ వగు నీకు అదృష్టము పట్టినందున అహం కారి వైతివి; నీకా యదృష్ట ప్రభావంబువలన కన్నులు కనం బడ వయ్యె, చెవులు వినవయ్యె, నోరు తెఱవదయ్యె, గర్వ

తుఁడ వగు నీకీ పదవి తగదు. నీ ఐశ్వర్యంబంతయు నేఁటితోఁ బోవునుగాక ' అని శపించి వెడలి పోయెను. ఆ క్షణముననే అసురులు వచ్చి అమరావతిని స్వాధీనము చేసికొని దేవేంద్రుని తఱుముఁ గొట్టిరి. వాఁడు మిక్కిలి చింతించుచు నగరమునుండి వెడలి యడవికిఁ బోయి తల దాఁచికొని కాలము గడపు చుండెను.

8. అహంకరించువారి కెప్పుడును ఆపద సంభవించును. వినయము, శాంతము, పెద్దలయందు మర్యాద, పేదలయెడ కనికరము, బంధువులయందు దాక్షిణ్యము, సాధువులయెడ ప్రేమ, అను నివి మొదలగు ఉత్తమగుణములు గలవారై మెలఁగువారు సకల సౌఖ్యముల ననుభవింతురు.

---

## 19. అహంకారము కూడదు—II

---

మహాభారతయుద్ధానంతరము, అర్జునుఁడు "ఈ యుద్ధంబునందు అనేకులను నేను జంపి జయము నొందితిని, నాతో సమాను లెవ్వరును లేరు" అని అహంకరించి యుండెను. శ్రీ కృష్ణమూర్తి అర్జునుని తలంపెఱింగి, వాని యహంకారమును మట్టుపఱచవలయు నని తలంచి, అతని నొకానొక పర్వత శిఖరంబు మీఁదికిఁ దోడ్కొని చనెను.

2. ఆ పర్వతశిఖరంబుపై నొక ముసలిగ్రద్ద కూర్చుండి యుండెను. శ్రీ కృష్ణుఁడు ఆ గ్రద్దను జూచి, "గృధ్రరాజా!

నీవేల యిచ్చట చతికిలఁబడి కూర్చుండి యున్నాఁడవు ?" అని యడిగెను. అందుల కా గ్రద్ద "అయ్యా ! నేను ఆహారము లేమిచే బడలియున్నాను. త్రేతాయుగమునుండి భారతయుద్ధము జరగుననియు, నా కాహారము లభించుననియుఁ గాంచి యున్నాఁడ. ఆ భారతయుద్ధము ఎప్పుడు జరగును ?" అనెను.

3. కృష్ణుఁడు, "త్రేతాయుగమునుండి నీవు కాచికొని యున్నావని చెప్పుచున్నావు ; రామరావణ యుద్ధ మెట్లు జరిగెను? అది నీకుఁ దెలియునా ?" అన, నా గ్రద్ద, "అయ్యా! ఆ యుద్ధము నేమని చెప్పుదును ! ఆ సంగ్రామ సమయంబునందు నేనొక్క పర్వతాగ్రంబునఁ గూర్చుండి యుంటిని. రక్తము మహానదీప్రవాహమువలె నెల్ల చోటులందును వ్యాపించి ప్రవహించు చుండినదే గాక, యీ పర్వత శిఖరంబు దనుక వచ్చినది. ఆ రక్త ప్రవాహంబునఁ గొట్టుకొని వచ్చిన మాంస ఖండములను తినచాలక తిని, రక్తమును వలసినంత త్రాగితిని. ఇంతదనుక నేను అట్టి యుద్ధమును జూడలేదు. భారతయుద్ధము జరగినచో నా యాఁకలి తీఱు నని తలంచి యిచ్చటఁ గాచి యున్నాను. ఆ యుద్ధ మింక నెన్నాళ్ళకు జరగును ?" అని యడిగెను.

4. ఇట్టు లడుగఁగా శ్రీ కృష్ణమూర్తి, "గృధ్రరాజా ! భారతయుద్ధము జరగి చాల దినము లాయెను. నీకేమియు దొరకలేదా ?" అన, గద్ద, "అయ్యా ! ఆ యుద్ధము జరగి

పోయినదా ? అదియు నా యదృష్టమే ! నే నీ కురుక్షేత్రము నందే యున్నాను కదా. ఒక బొట్టు నెత్తురైనఁ గనఁబడలేదు ; అది పిల్లకాయల జగడమా యేమి ?" అనెను.

5. గద్ద చెప్పిన మాటలను విని, అర్జునుండు లజ్జించిన వాఁడాయెను. "సామాన్యమైన గద్దయే ఈ యుద్ధమును అల్ప మని తలంచినదికదా. ఇఁక మహారథు లేమని తలంతురో ! శ్రీరాముఁ డెంతటి వీరుఁడో! అతనిముందు నాపరాక్రమం బెంత మాత్రము ?" అని తనలో ననుకొని అహంకారమును మాని కృష్ణమూర్తితోఁ గూడ మరలి పోయెను.

6. అహంకరించువారలకు అవమానము తప్పక సంభ వించు నని యీ కథవలన వేద్యమయ్యెడిని.

## 20. సత్యము పలుకుము.

మహాభారతయుద్ధంబునందు భీష్మాచార్యులవారు పది దినంబులు యుద్ధంబు చేసి, ఇఁక ధనుస్సును, బట్టుట లేదని ప్రతిజ్ఞ చేసికొనెను. అనంతరము దుర్యోధనుఁడు ద్రోణాచార్యు లకు సర్వసేనాధిపత్యం బొసంగి, కౌరవ సైన్యంబు నడపు నట్లు నియోగించెను.

2. ద్రోణాచార్యులు మహా ఘోరయుద్ధం బొనర్చి, తన సామర్థ్యముచే పాండవుల కెంతయు జయంబు కలుగనీక చేసె ను. భీమార్జునాదులకు ద్రోణాచార్యులతో నెదుర్కొనుటకు

గాక చాల ఖిన్నులై యుండిరి. ప్రతి యుద్ధంబునందును ద్రోణాచార్యులే జయంబును వడయుచుండిరి.

3. "ఈ సమయంబునం దేదేని యుపాయంబు చేయక పోయినచో పాండవులకు అపజయంబు కల్గును, కౌరవులకే జయంబు కల్గును. ద్రోణాచార్యులను మడియించుటకు సాధ్యము కాదు. అతనిని తనంతన ప్రాణములు దొఱంగునట్లు చేయుటయే మంచిది. అతనికి తన పుత్త్రునియెడ మిక్కిలి వాత్సల్యము కలదు. వాని కేదేని కీడుకల్గె నని విన్నచో నతండు పుత్త్రశోకంబుచే ప్రాణంబులను ద్యజించును. కాదేని శస్త్రసన్న్యాసమైన చేయును. ఇట్లు అతఁడు చేయునేని పాండవులకు జయంబు కల్గును" అని శ్రీకృష్ణమూర్తి యాలోచించెను.

4. ఇట్లు ఆలోచించి "అశ్వత్థామాహతః" అని ఘోషింపుఁ డని పాండవ సైనికులకు శ్రీకృష్ణుఁడు చెప్పఁగా, వారు అలాగే దిక్కులు మాఱుమ్రోగునట్లు ఘోషించిరి. ద్రోణాచార్యు లీ వార్తను వినియు తన కొమరుఁడు అశ్వత్థామ చిరంజీవి కావున వాఁడు మరణించిన వార్త కల్ల. అయినను, సత్యసంధుఁ డగు ధర్మరాజు నోటనుండి యీ వార్త వచ్చునేని నిజమని నమ్మఁదగును" అని భావించెను.

5. అపుడు శ్రీకృష్ణమూర్తి తన యుక్తి పనికిరానందున, వెంటనే ధర్మరాజు నొద్దకు వచ్చి, అశ్వత్థామ గతించె నని చెప్పు మనెను. ధర్మగుణమును సత్య వచస్కుఁడు నగు యుధిష్ఠి

రుఁడు, "మనకు అపజయము కల్గి వనవాసము ప్రాప్తించినను సరియే, అబద్ధము చెప్పను" అనెను.

6. ఆ సమయమునందే అశ్వత్థామ యను పేరుగల ఏనుఁగు మృతినొందెను. శ్రీకృష్ణుఁడు ఇదే మంచి సమయ మని భావించి, ధర్మరాజును గాంచి, "అశ్వత్థామ గజము చచ్చినది నిశ్చయమే కదా? ఈ వార్తను నీవు ప్రకటించుట కేమి యభ్యంతరము ?" అన, ధర్మరాజు నిజము చెప్పుటయందు దోషములేదని తలంచి "అశ్వత్థామా హతః కుంజరః" అనెను.

7. ధర్మరాజు, "అశ్వత్థామా హతః" అని చెప్పునంతవఱకు మిన్నకుండి, "కుంజరః" అని చెప్పఁ దొడంగక మున్నే పాంచజన్యములు పూరించెను. అందువలన, ద్రోణాచార్యులు, తన కొడుకు అశ్వత్థామ మరణింపకున్న ధర్మరాజు చెప్పఁ డని నిశ్చయించి, చేతనున్న * శస్త్రంబును నేలం బడ వైచి నిశ్చల చిత్తుండై యోగధారణంబుచేఁ బ్రాణంబులం దొఱంగెను.

8. యుద్ధానంతరము కొన్ని దినంబులకు పాండవులు లోకయాత్ర చాలించి స్వర్గంబునకు చనునపుడు, దూతలు, ధర్మరాజును నరకలోకమార్గముగఁ దోడ్కొని పోయిరి. అపుడు ధర్మజుఁడు తన్ను నరకలోకమార్గంబుగాఁ దోడ్కొని పోవు

*శస్త్రమనఁగా, చేతఁబట్టుకొనియుండు ఆయుధము. అస్త్రమనఁగా, చేతినుండి విసరి వైచెడి ఆయుధము.

టకు గతం బేమి? అని యడుగఁగా, "మీరు నిజమును చెప్పెడి వ్రతము గలవారే యైనను, ద్రోణాచార్యులు మీ మాటను నమ్మి ప్రాణోత్క్రమణంబు చేసిరి. కావున ఆ దోషము నిమిత్తమై మీకీ నరకలోక దర్శనము సంభవించెను" అనిరి.

9. ధర్మరాజు అసత్యము చెప్పుటచే ద్రోణాచార్యులకు కీడుకలుగునని యెఱింగియే కదా శ్రీకృష్ణమూర్తి "అశ్వత్థామా హతః" అని చెప్పవలసినదని కోరినపుడు చెప్పలేదు. అటు లుండ, ఇపుడు తాను జెప్పెడిమాట సత్యమే యైనను, అదియు మొదటి మాటవంటిదే యగుటం బట్టియు, ఆ వార్తను విన్నంతనే ద్రోణాచార్యులకుఁ గీడుకల్గునని దెలిసియుండుటంబట్టియు నది దోషముగాఁ బరిణమించెను. కాఁబట్టి, ఏ మాటవలన పరులకు నష్టము సంభవించునో అట్టిమాటను చెప్పరాదు. మఱియు నిజమైన మాటగానున్నను సంశయాస్పదమును మనస్సునకు ఆయాసమును గల మాటలను జెప్పరాదు. అబద్ధము సకల పాపములకంటెను అధికమైన పాపము. సత్యము సకల ధర్మములకంటెను శ్రేష్ఠమైనది. ఇంతియగాక, అసత్యమాడువారికి, ఈలోకమునందును పరలోకమందును తప్పక దండము కల్గును.

గీ. సర్వభూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ వొండు లేదు
ఒరులనొప్పికోడ కుపతాప మొనరించు
నదియ కడు నధర్మ మనిరి మునులు.

# 21. పరులసొమ్ము గోరకు

లోకమునందు జలము లభించుటకు ముఖ్యాధారము వర్షము. వర్షము క్రమముగాఁ గురియక పోవునేని, మనకు జలము తగ్గిపోవును. జలము కొఱఁత వడునేని పరిశుద్ధము కొఱఁతవడును. పరిశుద్ధము కుందువడునేని, ఆరోగ్యము కుందు వడును. ఆరోగ్యము క్షీణించునేని లోకులును తక్కిన జీవ కోట్లును బాధనొంది విగతజీవు లగుదురు.

2. మఱియు, జలము తక్కువ యగునేని పంట తగ్గి పోవును. పంట తగ్గనేని, మనుష్యులు మొదలుగాఁగల సకల ప్రాణులును జీవనాధారమైన ఆహారము లేక నశించును. వర్షము లేని కారణముచే పంట తక్కువవై జనులు ఆహారము లేక, అల్లాడు నట్టికాలము 'క్షామకాలము' అనఁబడును. వర్షము కురిసి చక్కఁగా పంట పండి, ప్రాణులు సౌఖ్యముగానుండు కాలము 'క్షేమకాలము' అనఁబడును.

3. ఒక్కొకప్పుడు వర్షాభావముచే క్షామము సంభ వించి పన్ని డెండేండ్ల దాఁక నుండుటయుఁ గలదు. ఒకానొక క్షామకాలమునందు శరీరమును సంరక్షించుకొనుటకు మార్గములేక అనేకులు గతించిరి. ఆకులలములు దిని కాలము గడపుట కైనను వర్షము లేనందున నవియును ఎండిపోయెను. కాఁబట్టి అడవియందున్న వారును మరణించిరి.

4. అడవులలో వసించు ఋషులలో 1. మరీచి, 2. అత్రి, 3. అంగిరస్సు, 4. పులస్త్యుడు, 5. పులహుడు, 6. క్రతువు, 7. వసిష్ఠుడు అనువారు ప్రసిద్ధులు. వారికి కంద మూల ఫలములు సైతము దొరకుట దుర్లభంబయ్యెను. ఒకానొక రాజు వారి యొక్క కష్టమును శాంతమును గని, ఆహారపదార్థములను బంపెను.

5. అపు డా ఋషు లేడ్వురును, "ఇతరుల ద్రవ్యమును గైకొనము. ప్రజలకుఁ జేరవలసిన ద్రవ్యమును మాకుఁ బంపినావు. కావున, మేము తీఁకము. దీనిని నీ ప్రజల కొసంగి రక్షింపుము. ఆహారము లేక అల్లాడుచుండు నీ యాశ్రితుల కొసంగుము. మాకు సహాయము చేయవలయు ననెడి కోరిక గల నీ మంచి తలంపునకు మిక్కిలి సంతుష్టినొందితిమి. శీఘ్ర కాలమున క్షామబాధ నివృత్తియై నీ రాజ్యము సుభిక్షమై వెలయునుగాక" అని చెప్పి, ఆ ద్రవ్యమును బంపివైచిరి.

6. ఆ రాజు ఋషులు చెప్పిపంపిన వార్తలను వినియు, సంతుష్టి నొందక, మహాత్ములగు ఋషు లేడ్వురకును ఏవిధముననైన నాహార మొసంగవలయు నని నిశ్చయించి, వారు సంచరించు మార్గమునందు ధాన్యమును, కందమూల ఫలములను, ఇతర పదార్థముల నుంచియుండెను.

7. ఋషు లా వస్తువులను జూచి, "వర్షము లేక జనులు మలమల మాడి చచ్చుచుండు నీ సమయంబున నిన్ని వస్తువు

లెట్లు సులభంబుగ లభించును ? దీనికిం గారణ మేమి ? వీని నెవ రేని యుంచియుందురు. లేనిచో నిక్కడ నివి పడియుండవు కదా ? అజగరము లన్నియు మ్రాని మొద్దులవలె కదలక మెదలక పడియుండును; అవి తనయొద్దకు వచ్చిన ప్రాణులను కబళించును. ఆ ప్రకారమే ఇతరుల వస్తువులును చలనములేక పడియుండి, ఆశచూపి ముంచివేయును. వీనిని స్పృశించినవారిని పాపపంకమునం గూల్చును'' అని పరస్పరము సంభాషించుచు వెడలి పోయిరి.

8. పిమ్మట, వారు కొంతదూరము చని యొకానొక తటాకమునం దున్న తామరతూండులను గైకొని క్షుద్బాధను మాన్పికొని చనిరి. ఎంత కష్టము సంభవించినను పరుల ద్రవ్యము గోరందగదు. పరులద్రవ్యమును గోరుట మహాపాతకం బని యెఱింగి వానిని స్పృశింపకుండవలయును.

9. ఎవరుగాని ఏదేని యొక కార్యము చేయందొడంగుటకు మునుపు ఆ కార్యమునుగూర్చి ఆలోచింపవలయును. అదియే 'చింతనము' అనంబడును. మాటిమాటికి ఆ కార్యమును చింతించుటచే నది దృఢపడును. కార్యాకర్తలకు తమ చింతనా దార్ఢ్యమునకుం దగినట్లే ఇచ్ఛ పొడమును. మఱియు, వారొనర్చు కార్యములును వారి ఇచ్ఛకు దగినట్లే యుండును. చింతించుటయును ఇచ్ఛగించుటయును కర్మమే; మాటలచే వెలిపుచ్చుటయును కర్మమే; శరీరముతో నేదేని కార్యము

చేయుటయును కర్మమే కావున, ఇతరుల ధనమును గోరుట దుష్కార్య మని తలంచి, దానిని గోరకుండుట ధర్మ మగును.

క. పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగన సస్యపడు న
న్నరుఁడు దెవులు లేని వేదనంబడు నధిపా.

---

## 22. దొంగలింపకుము.

---

శంఖుఁ డనియు, లిఖితుఁ డనియు పేర్లుగల అన్నదమ్ము లిర్వు రుండిరి. వారిలో శంఖుఁడు పెద్దవాఁడు; లిఖితుఁడు చిన్న వాఁడు. వీ రిర్వురును వేర్వేఱు కుటీరములయందు వాసము చేయుచుండిరి. ఒకనియొద్దకు వేఱొకఁడు తరుచుగాఁ బోవుట లేదు.

2. శంఖుఁడు తన తోఁటయం దొక అపరూపమైన అరఁటిచెట్టు నాఁటి పెంచుచుండెను. ఆ చెట్టునందలి గెల చక్కఁగా పండియుండెను. కర్షకుఁడు తాను పైరు బెట్టునట్టి మొదటిపంటను దాని నొసంగిన దేవునకు సమర్పించి, అనంతరము తాను స్వీకరించును. ఈ యభిప్రాయము ననుసరించియే సంక్రాంతిపండుగ జరుపఁబడుచున్నది కాఁబోలు.

3. శంఖుఁ డా పండ్లగెలను కోసి భక్షింపక, దేవునకు సమర్పింపఁ దలంచి దానిని కోయకుండెను. చిన్నవాఁడైన

లిఖితుఁడు ఒకనాఁడు అన్న కుటీరమునకుం జని ఆ యరఁటి పండ్లగెలను జూచి, దానిని తినవలయు నని తలంచెను. అయి నను, వీఁడు తన యన్న తలంపు నెఱుఁగఁడు.

4. ఒక దినంబునందు శంఖుఁడు కుటీరమున లేని సమ యంబున లిఖితుఁడు తన అన్న కుటీరమునకుఁ బోయి అరఁటి పండ్లను జూచి, ఇవి మిక్కిలి అపూర్వమైనవి. ఇట్టి పండ్లను నే నెన్నఁడును జూడలేదు. వీని కాంతియు పరిమళమును అద్భుత ముగా నున్నది; ఇఁక రుచినిఁ గూర్చి వేఱ చెప్పవలయునా? వీనిలోఁ గొన్ని పండ్లను నేను భుజించుటవలన, నా యన్న కేమినష్టము? ఈ గెలలోని పండ్లన్నిటిని అతఁ డొక్కఁడే తినఁ గలఁడా?" అని యాలోచించినవాఁడై గెలలోనిపండ్లను గొన్ని టిని గోసి తినుచుండెను.

5. తమ్ముఁడు పండ్లు తినుచుండు సమయమున, అన్న వచ్చెను. అతఁడు తమ్మునిఁగాంచి, "పరులసొమ్మును వారి యను మతి నొందక, గ్రహించుట దొంగతన మనఁబడును. అది పంచ మహాపాతకములలో నొక్కటి యగును. 1. దొంగలించుట, 2. అబద్ధమాడుట, 3. హత్యచేయుట, 4. కల్లు ద్రాగుట, 5. గురునింద జేయుట అనునవి పంచమహాపాతకములు.

6. ఈ పాతకము లేనింటిలో నేదిచేసినను రాజదండము ననుభవింపవలయును. మఱియు నీ పాతకములకై యమలోక మున విధింపఁబడు దండము మిక్కిలియు క్రూరముగా నుండును.

ప్రకృతము రాజదండమ ననుభవించినచో యమలోక దండము కొంచెము తగ్గును. కాఁబట్టి, నీవు రాజునొద్దకేగి నీవు చేసిన తప్పును జెప్పి దండము ననుభవింపుము " అనెను.

7. అన్న చెప్పిన చొప్పున లిఖితుఁడు రాజు కడకేఁగి తన తప్పు నెఱింగింపఁగా నతఁడు, నీవు న్యాయమునకు లోఁబడి పాపమునకు భీతిచెంది, దండము విధింపవలయునని కోరు చున్నావు. ఎప్పుడు నీవు చేసిన పాపకార్యమునకై పరితపించి తివో, అప్పుడే నీపాపము నివృత్తియైనది. అయినను, నీవు నీ యన్న కడకుం జని మన్నన వడయుము" అని చెప్పెను.

8. లిఖితుఁడు, "నా యన్న నన్ను మన్నింపఁగలవాఁ డనుటయందు సంశయము లేదు. అతఁడు మన్నించుటచేత నాపాపము నివృత్తి కానేరదు. తప్పుచేసినవాఁడు దండా ర్హుఁడు. ఇప్పుడు రాజదండము నొందనిచో యమదండ మధిక మగును. కాఁబట్టి ధర్మశాస్త్రము ప్రకారము నన్ను దండిం పుఁడు" అన, రాజు దండించెను.

9. ఈ కథయందలి సారాంశ మేమన, ఇతరుల వస్తువు లను, వారి యనుమతిలేక, గ్రహింపఁదగదు. కొందఱు, ప్రకృ తోపయోగముకాని వస్తువుల నెచ్చటనైన నొకమూల నుంచి యుందురు. అట్టి వస్తువులను గైకొనుటవలన వారికి నష్టము గాని, కష్టముగాని ఉండదని తలంచి గ్రహింపరాదు. దొంగ తనము మహాపాతకము. ఎప్పటికిని దొంగతనము చేయఁగూడదు.

దొంగతనము మొదలుగాఁగల పాతకములను జేయువారు ఎప్పు డును మెప్పొందరు.

గీ. సత్కులంబునఁ బుట్టుట సకల వేద
ములఁ బురాణంబులను శాస్త్రములను జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రాపకములు గావు
శీలసామగ్రి లేని దుశ్చేష్టితునకు.

---

## 23. చాడి చెప్పకుము

పాండవులు పర్ణశాల నిర్మించుకొని యందు వసియించి యుండు కాలంబునందు, ఒక్కనాఁడు శ్రీకృష్ణమూర్తి అచ్చో టికిఁబోయి ధర్మరాజుతో ముచ్చట లాడుచుండెను. ఆ సమ యంబునందు, కలహాశనుండైన నారదమునీంద్రుండు భీమసేనుం గాంచి, "ఏమయ్యా! క్షేమమా?" అనఁగా, భీముఁడు నార దునకు నమస్కరించి, "స్వామీ! మా సంపదయంతయు కౌరవు లపహరించిరి కదా. ఇఁక మాకు క్షేమ మెక్కడిది? అయినను ఆ దుష్టులగు కౌరవు లెప్పుడు నశింతురు?" అని దీనుండై యడిగెను.

2. నారదముని, "అయ్యా! మీరు సత్యసంధులరు. మీ కిట్టి కష్టము రాఁదగదు. సర్వశక్తివంతుఁడగు శ్రీకృష్ణు నకు కరుణ గలిగెనేని, మీ శత్రువుల నతఁ డొక క్షణమున నశింపఁ జేయఁగలఁడు. అయినను, అతనికి కౌరవులమొఁద నధిక

ప్రీతికలదు. సకల భోగభాగ్యములను వారల కిచ్చియున్నాఁడు. పాండవులు తమకుఁ బ్రాణమని నోటితోఁ జెప్పుచున్నాఁడు.



మీ యొద్ద స్నేహితునివలె కపటనటన చేయుచున్నాఁడు. ఇట్టి నడవడికను చూచుచుండియు నీవును నిజమెఱుంగక యూర

కున్నావు. ఇట్లుండుట నీకుఁ దగునా ?" అని చెప్పి వెడలి పోయెను.

3. నారదుని మాటలలో నొక్కటియైనను నిజము కాదు. కృష్ణునకు కౌరవులయెడ ప్రీతిలేదు. కలహము చేయుట కొఱకు నారదుఁడు భీమునకు లేనిపోని మాటలు చెప్పెను. కృష్ణునకు పాండవులయెడ అధిక ప్రీతికలదు. అయినప్పటికిని, నారదుఁడు సామాన్యముగాఁ గనంబడువాని నెత్తిచెప్పి భీముని నమ్మించెను. ఇట్లు లేనిపోని మాటలను చెప్పుటయే చాడి చెప్పుట యనఁబడును.

4. భీముఁడు నారదుని మాటలను నిజమని భావించి, మిక్కిలి క్రుద్ధుండై, కన్నులనుండి నిప్పుకలురాల, పెదవు లదర, పటపట పండ్లుకొఱుకుచు వీరావేశముతోఁ ప్రళయకాల రుద్రునివలె నార్భటించుచు తన గదాయుధంబును కేలందాల్చి, కృష్ణుం డెప్పుడు వచ్చునాయని కాచియుండెను. పర్ణశాలనుండి కృష్ణుండు రాఁగని, యతనిని వెన్నంటి తఱుముచుఁ బోయెను.

5. శ్రీకృష్ణుఁడు ముందుగా పరుగిడ నారంభించెను. వెనుకకు మరలెను. వంకరగా పరుగెత్తెను. అతివేగముగా పరువులిడెను. ఇట్లు పలువిధముల పరుగులిడెనుగాని, భీముఁడు వదలునట్లు కనఁబడలేదు. అంత, కృష్ణుఁడు నిలువంబడి, "అయ్యా! నీవు నన్నుఁ గొట్టవచ్చుటకుఁ గారణ మేమి ? దాని నెఱింగించి, పిదప నన్నుఁ గొట్టుము" అన, భీముఁడు "ఓరి

కృష్ణా! నీవలనఁ గదా మా కింత కష్టము సంభవించెను. మా శత్రువులకు వలయు సంపదల నొసంగితివి. మమ్ము నిడుమలకు లోనగునట్లు కావించితివి. ఇట్లగుటకు నీవు చేసిన దురాలోచనయే కారణము. కాఁబట్టి, నిన్నుఁ గొట్టి చంపుటకు నిశ్చయించితిని. నేడు గదా నీ కపటోపాయమును గూర్చి నారద మునీంద్రుఁడు నాతోఁ జెప్పెను” అనెను.

6. శ్రీకృష్ణమూర్తి నవ్వి, “అయ్యా! నీకు రహస్యము తెలియదు. కౌరవుల పుణ్యము మిక్కిలి స్వల్పము. దాని నిప్పుడు వా రనుభవించుచున్నారు. శీఘ్రకాలమున వారికి కష్టము కల్గును. మీ కష్టము కొన్నాళ్లవఱకే యుండును. కష్ట సుఖములు కర్మానుసారముగఁ గల్గును. నారదుని స్వభావము నీకుఁ దెలియదా? అతఁడు చెప్పిన చాడిమాటలు నిజమని నమ్మి తొందరపడకుము” అని శాంతవచనములతో నూఅడించెను.

7. అనంతరము భీముఁడు చిత్తశాంతి నొందినాఁడు. నారదుని వాక్యములను నమ్మి పాండవులు శ్రీ కృష్ణునియెడ విరోధము వహించి యుందురేని మిక్కిలి చిక్కులంబడి యుందురు. పాండవులకు సంభవింప నున్న కష్టము లన్నియు, చాడిమాటలను వినకున్నందున తొలఁగినవి.

8. ఎప్పుడును ఉన్నది యున్నట్లు చెప్పుటయే మంచిది. నిజమును మఱుఁగుజేసి మాటలాడువాఁడు పరులకు మన

స్సంకటమును చెడుగును కలుగఁ జేయుటయే గాక, తానును చెడుగు దెచ్చుకొనువాఁ డగుచున్నాఁడు. ఏ సమయమున నేది చెప్పిన పరులకు హితముగ నుండునో దానిని మాత్రము చెప్ప వలయును. నిజమైన మాట లైనను పరులకు అప్రియమును ఆయాసమును కలుగునట్టివిగా నున్నచోఁ జెప్పరాదు. అనఁగా, ఎవరికి గాని మనస్సంకటము కలుగునట్టి మాటలను జెప్పఁ గూడదు. ఇట్లు సమయ మెఱింగి పరుల మనస్సునకు హిత ముగ నుండు మాటల నాడువాఁడే నీతిజ్ఞుఁడు.

9. చాడిచెప్పి జగడముపెట్టి వేడుకచూచుట తగదు. చాడిచెప్పువాఁడు దుష్టుఁడు. చాడిచెప్పువానిని ఎవరును నమ్మరు. చాడిమాటలకు చెవియొగ్గరాదు. చాడి చెప్పువానిని సత్క రింపరు. కాఁబట్టియే "కొండెము చెప్పెడివాని నమ్మరాదు" అనియును, "చాడిచెప్పువాఁడు చండాలుఁడు" అనియును, పెద్దలు చెప్పుచున్నారు.

క. ఎదిరికి హితమును నిజమును
మది కింపునుగాఁగ బల్కు మాటలదిక్కై
రొదవినను లెస్స యదిగా
కిది యది యని యూరకుంట యొంతయు నొప్పున్.

---

## 24. క్రమము.

---

ఒక్కతీరుగా ప్రవర్తించుట క్రమమనఁబడును. అనఁగా హెచ్చు తక్కువలు లేకుండుట. మనము లోకమునందు

అనేక విధములగు వస్తువులను జూచుచున్నాము. అవి పలు విధములుగాఁ గానంబడుచున్నప్పటికిని, ఒక్కొక్కటియు నొక్కొక్క క్రమము ననుసరించినదిగనే యున్నది. స్వభావముగా నేర్పడియుండు ప్రతి వస్తువును క్రమము తప్పనిదై యున్నది. దీనికి దృష్టాంతము నీ దిగువ వ్రాయఁబడియెడిని.

2. ఆకాశమునందుఁ జూచితిమేని పగటియందు సూర్యుండును, రాత్రియందు చంద్రుఁడును నక్షత్రములును గానంబడును. సూర్యచంద్రులు క్రమము తప్పక సంచారము చేయుచున్నారు. అట్లే నక్షత్రములును సంచరించుచున్నవి.

3. సూర్యుఁడు తూర్పున నుదయించి పడమట అస్తమించుచున్నాఁడు. చంద్రుండును ఆ ప్రకారమే ఉదయాస్తమయముల నొందినప్పటికిని, సూర్యునివలె స్పష్టముగాఁ గనంబడుట లేదు.

4. చంద్రుండు ఒకప్పుడు వృద్ధియు, ఒకప్పుడు క్షీణము నొందును. ఈ వృద్ధి క్షీణములు సయితము, కాలమును క్రమమును అనుసరించియే జరగును. అనఁగా, శుక్లపక్షమున వృద్ధియు, కృష్ణపక్షమున క్షీణము నొందును. ఇట్లు ప్రతి పక్షమునను క్రమము తప్పక జరగుచుండును.

5. ఒక నక్షత్రమును ఒకనాఁటి రాత్రియందు పదిగడియల కొకచోట చూచితిమేని, మఱునాఁడా వేళయందు

ఆ చోటనే ఆ నక్షత్రమును జూడవచ్చును. నక్షత్రములు ఆకాశమునందు క్రమభంగముగా నున్న దని తలంపరాదు. ఒక్కొక నక్షత్రమునకును ఒక్కొకచోటు నియతమై యున్నది.

6. ఇఁక సముద్రతీరమున నిలచిచూచిన, అలలు ఎడ తెగక వీచుటను గనుఁగొనవచ్చును. ఒక సమయమునందు సముద్రజలము గట్టునకు వచ్చును; మఱియొక సమయమునందు గట్టునుండి సముద్రమునకుఁ బోవును. సముద్ర జలము గట్టు నకు వచ్చుటకు పోటనియును, గట్టునుండి సముద్రము లోనికిఁ బోవుటకు పాటనియును పేళ్లు. పోటునకుఁ గాని, పాటునకుఁ గాని, ఒకప్పు డెంతకాలము పట్టునో, అంత కాలమే మరల సంభవించు పోటునకును, పాటునకును పట్టును. ఇట్లు పోటు పాటులు క్రమముతప్పక జరుగుటంబట్టి, మనము వానియొక్క కాలనిర్ణయమును సులువుగాఁ దెలిసికొని చెప్పుటకు సాధ్య మగును.

7. సముద్రతీరమునుండి భూప్రదేశమునకుఁ బోయి నదీప్రవాహమును జూచినచో నదియు క్రమప్రకారమే ప్రవ హించుచున్నది. అనఁగా జలము మిట్టయందుండి పల్లపు ప్రదే శమును జేరుచున్నది. కాని, ఆ ప్రవాహము తాఱుమాఱుగా ఒకప్పుడు మిట్ట కెక్కి మఱొకప్పుడు క్రిందికిజాఱి, ఇంకొకప్పుడు అడ్డముగాఁ దిరిగి ప్రవహించుట లేదు. ఇట్లు ప్రవహించుజలము క్రమముగా పల్లము వైపు ననుసరించుచుఁ బోయి తుదకు

సముద్రమునందుఁ జేరుచున్నది. ఇందువలన, జలము ఎప్పుడును మిక్కిలి పల్లపుప్రదేశమున నుండు సముద్రమునే చేరుననుట యం దెంతయు సంశయము లేదు.

8. మఱియు వసంతఋతువు, గ్రీష్మఋతువు, వర్షర్తువు, శరదృతువు, హేమంతఋతువు, శిశిరఋతువు అను నీ యాఱు ఋతువులును ప్రతిసంవత్సరమునందును ఒకదాని వెంబడి మఱి యొకటి వచ్చుచుండును. ఈ ఋతువులు క్రమముతప్పక అయా కాలములందుఁ గనంబడును. ఈ ఋతువులు ఎప్పుడును వ్యత్యస్తము నొందవు. పగలును రాత్రియు నెట్లు క్రమము తప్పక వచ్చుచుండునో అట్లే ఋతువులును వచ్చుచుండును. వసంత ఋతువునందు వృక్షములన్నియు పూచి కాచి ఫలింప నారంభించును; గ్రీష్మఋతువునందు ఎండగాయును; వర్షర్తువునందు వాన కురియును; శరదృతువునందు శీతలముగా నుండును; హేమంతఋతువునందు మంచు కురియును; శిశిరఋతువునందు ఆకులు రాలును.

9. ఇట్లు ప్రపంచమునందు స్వభావముగా నమరి యుండు సర్వమును క్రమముతప్పక జరుగుచున్నదని మనము నిశ్చయింపనియెడల, మనగతి యేమగును? మనము సర్వవిధములయందును కష్టములపాలు కావలసివచ్చును; జీవితమునం దెవరికిని అభిలాష యుండదు; అన్నియు పాడగును. ఎట్లన, సూర్యచంద్రు లెచ్చోట ఉదయించి, ఎచ్చోట అస్తమించు

వనెడి నమ్మకము మనకుండదు గదా. సముద్రమునందు ఓడను ఎట్లు నడపుట యనునది మాలిమికి తెలియక పోవును. ఆకాశ మునందు కనంబడు గ్రహము లన్నియు వానికి స్వాభావముగా నేర్పడియుండు ప్రదేశమునుండి క్రమము తప్పక సంచరించు నని మనకుఁ జక్కఁగాఁ దెలియును. భూమిలోని వస్తువులు క్రమము తప్పినప్పటికిని, ఆకాశమున నుండు గ్రహములు క్రమము తప్పవని మనకు నిశ్చయముగాఁ దెలిసియున్నది.

10. క్రమము ననుసరించియే ప్రపంచము నిలుకడగా నున్నదని పైని కనఁబఱచిన దృష్టాంతములను బట్టి మనము తెలిసికొంటిమి. ఆ స్వాభావిక క్రమము ననుసరించియే మనము సకల వ్యవహారములను నిర్వర్తించికొనవలయును. ఇట్టి క్రమ మును మనస్సునందుంచికొని ప్రవర్తించుటయే క్రమమైన తెలివి యనఁబడును. మన పెద్దలు తమ యనుభవముచే క్రమమును గుర్తెఱిఁగి కొన్ని విధులను ఏర్పఱచి యున్నారు. మనము ఆ విధుల చొప్పున నడచుకొనినచో క్షేమము నొందవచ్చును. లేనిచో కష్టమును నష్టమును పొందవలసినవార మగుదుము. ఆ విధులలో ముఖ్యమైనది యేమనఁగా, వేకువను నిద్రనుండి లేవవలసినది. దీనిని మాత్రము క్రమముగా జరుపుకొనుచుందు మేని, మనము చేయు పనులన్నియు క్రమముగా నుండునని నిశ్చయించికొనవచ్చును. ఇట్లు ఒక్కొక విధిని క్రమముగా నభ్యాసము చేయవలయును. "అది వంకర అంత్యముదాఁక

వంకర" అను రీతిగా, మొదటిది క్రమభంగ మగునేని అన్నియు నట్లే యగును. కావున మనము ప్రతి కార్యమును క్రమము ననుసరించి చేయుచుండవలయును. అందువలన మిక్కిలి మేలును బొందుదుము.

క. విను శిష్ట చరిత మార్గాని
యనపాయత నడవ నడవ నంతఃకరణం
బునఁ బొదలునట్టి సమ్మద
మనఘా దుర్లభము చూవె యన్యపథములన్.

---

## 25. విద్యా ప్రభావము.

ఒకనాఁడు లక్ష్మియు సరస్వతియు, "నేనే పెద్ద" "నేనే పెద్ద" యని వాదించుచు, లక్ష్మి —"నా కటాక్ష మున్న యెడల ప్రజలకు సుఖము కలుగును; కావున నా శక్తియే అధికము" అని చెప్పెను. సరస్వతి —"ఎంత సంపద యున్నప్పటికిని, విద్యయు బుద్ధియు లేక పోవునేని, ఏ సౌఖ్యము నుండదు. కాఁబట్టి విద్యకును బుద్ధికిని అధిదేవత యగు నా శక్తియే గొప్పది" యనెను.

2. ఇట్లు వీ రిర్వురును తమ తమ శక్తులను పరీక్షింప నెంచి పోవుచుండిరి. దారిలో నొక చోట గుట్టలును గులక ఱాలును గల పొలమునందు మూఢుఁ డొకఁడు బక్క యెద్దులను నాఁగలికి పూన్చి, అవి త్వరగా దున్నలేదని యెంచి, ఎద్దుల ముందట నిలువంబడి మునికోలతోఁ గొట్టుచుండినాఁడు.

3. సరస్వతి, లక్ష్మినిఁ జూచి, "వీనికంటె మూర్ఖుఁడైన కర్షకుఁడు వేఱొకఁ డుండఁడు. వీనివలన మన శక్తులను పరీక్షింపవచ్చును గదా?" అన, లక్ష్మి "అటులే కానిమ్ము" అని చెప్పి, వానికి అమిత సంపద నొసంగెను. వెంటనే ఆ పొలమునందలి గులకఱాలన్నియు రత్నములాయెను. గుట్టలన్నియు బంగారమాయెను.

4. అయినను, సరస్వతి, వానికి బుద్ధి నొసంగ నందున, వాఁడా రత్నముల విలువను దెలిసికొనఁడయ్యె. ఒక వర్తకుఁడు ఆ దారిని పొరుగూరి సంతకుఁ బోయి తాఁ గొనిపోయిన వస్తువులను విక్రయించి ఉత్తబండి తోలికొని వచ్చుచుండెను. వాఁడు పొలములోని రత్నములను బంగారమును గాంచి ఆశ్చర్యమొంది, యివి కర్షకుని పుణ్య విశేషమువలన గలిగినవని తలంచెను. పిమ్మట, నా వర్తకుఁడు తనచే నైనంత బంగారమును రత్నములనెత్తి బండినిండు వైచికొని, ఆ కర్షకుని తనతోఁగూడ రావలసిన దని ప్రార్థించెను. వాఁడు రా నొల్లఁడయ్యె. అయినను, వానిని బలాత్కారముగా కట్టి బండియందు పడవైచికొని తన యూరికిఁ బోయెను.

5. అది మొదలు వర్తకుని వ్యాపారము చాల వృద్ధియాయెను. రాజులకెల్ల అప్పిచ్చుచుండినాడు. అందువలన నతఁడు ధనపాలుఁ డని పేరొందెను. ఇట్టి అమితైశ్వర్యము ప్రాప్తమైనందులకు కర్షకుఁడు కారకుఁడైనందున, ధనపాలుఁడు

వానిని మంచి స్థితియం దుంచవలయు నని భావించి, వానికి మంచి భోజనమును మేలైన వస్త్రముల నొసంగుచుండెను. అయినను, వాఁడు మూర్ఖుఁడు గాన, తన గ్రుడ్డిమొద్దును కుంటిమొద్దును కట్టులేని నాఁగలియు పోయినందులకై వగచుచు కన్నీరు కార్చుచుండెను. ధనపాలుఁడు వాని మూర్ఖ్యమును పోఁగొట్టఁ దలఁచి ప్రతి నిత్యమును పదిదెబ్బలు కొట్టుచుండినాఁడు. వాఁడా దెబ్బలకు భయపడి వర్తకుని మాటప్రకారము నడచుకొనుచుండెను. లక్ష్మీకటాక్షముచే కర్షకుని మొగమునందు ఐశ్వర్య తేజము ఆవహించినందున, వాఁడు రాజపుత్రునివలెఁ గానంబడుచుండెను. ఇట్లుండఁగా,

6. ఆ దేశాధిపతికి ఒక కొమార్త యుండెను. ఆమె అతిరూపవతి; మఱియు, విద్యావతి; ఆమెకు యౌవనదశ రాఁగానే తండ్రి, వరుని వెదుకుటకుఁ దొడఁగెను. ఎచ్చోటను దగినవాఁడు కనంబడఁ డయ్యె. అంత ధనపాలుని రావించి, "అయ్యా! నీవు వ్యాపారార్థమై పలుదేశములకుఁ బోవుచున్నాఁడవుకదా. ఏదేశమునం దైనను నా కొమార్తకుఁ దగిన పతిని విచారించి చెప్పుము" అనెను.

7. వర్తకుఁడు రాజానుమతి నొంది, యింటనుండి బయలుదేరి పలుచోటులకుఁ బోయినవానివలె నటించి, తన గ్రామమున కావల గుడారము వేసి యందు నివసించి, తన యింటనున్న కాపువానిని పిలిపించి, వానికి మంచి వస్త్రాభరణము

ధరియింపఁజేసి, వానికి రత్నపురి లక్ష్మీకుమారుఁడని పేరిడెను. మఱియు, గుడార ద్వారమును రక్షించుటకుఁ దగిన భటులను నియమించెను. పిమ్మట, వర్తకుఁ డచ్చోటనుండి బయలుదేరి రాజునొద్దకుఁ జని, "రత్నపురి రాజకుమారుఁడు తగినవాఁడు. అతఁడు మన యూరికి వెలుపల వచ్చి విడిసి యున్నాఁడు; అతఁడు గొప్పవాఁడు; మర్యాదగలవాఁడు; అతఁ డెవ్వరి తోను మాటలాడఁడు" అని విన్నవించెను.

8. రాజు చాల సంతసించి, పెండ్లికుమారుని ఎదు ర్కొని చని తోడి తెచ్చి శుభలగ్నంబున వివాహంబు చేసెను. వివాహ మహోత్సవమునాఁడు ధనపాలసెట్టి తలగుడ్డ కట్టు కొని జరీ వల్లెవాటు వైచికొని, వెండి పొన్ను వేసిన బెత్త మును చేతఁబట్టుకొని వచ్చి నిలిచి యుండెను. అప్పుడు మూఢు డగు పెండ్లికుమారుఁడు, నేఁడును తన్నా వర్తకుఁడు కొట్టు నేమో యని భయపడి నోరు మూసికొని యుండెను. అచ్చోట నున్నవారు, మహా ధనికుఁడగు ధనపాలసెట్టికూడ నోరు మూసి కొని విధేయతతో నిలువంబడి యున్నాఁడు; కావున, ఈ వరుఁ డెంతటి ప్రభువై యుండునో యని భావించి, యాతనిని చాల గౌరవించిరి.

9. ఆ మూఢుఁడు తన భార్యను, ఆమె వస్త్రాభరణ ములను జూచి, అది పిశాచి యని భావించి, యామెను జూచి నపు డంతయు తొలఁగి పోవుచుండెను. ఆ రాత్రి వరునికొఱకు

మేడమీఁద శయనగృహము నలంకరించి యుండిరి. వాఁ డచ్చ
టికి నిదురింపఁ బోయెను.

10. "నేను ఉదయమునఁ జూచిన పిశాచి యెచ్చటనో
దాఁగి యున్నది; నేఁడు సెట్టిబాధయు తప్పియున్నది. కాఁబట్టి,
నా పసరమును పొలమును బోయి చూచుట కిదియే మంచి
సమయము" అని తలంచి, యచ్చటనున్న గవాక్షమునుండి
దుమికి పోవుటకు నిశ్చయించి కిటికీని పట్టుకొని తొంగి చూచి
నాఁడు. అది అగాధమైన లోఁతుగానుండినందున, వాఁడు దిగులు
జెంది యట్లే వ్రేలాడుచుండెను. దిగువ దుమికి యుండునేని
మరణము సంభవించి యుండును.

11. అపుడు సరస్వతియు లక్ష్మియునువచ్చి వాని స్థితినిఁ
జూచిరి. సరస్వతి లక్ష్మినిఁ జూచి, "నీకృప యెంతయున్నను
ప్రయోజన పడలేదు. బుద్ధి లేనందున, వీనికి నీవలనఁ గల్గిన
యైశ్వర్యము ననుభవింపలేక ప్రాణమును బోఁగొట్టుకొనఁ
బోవుచున్నాఁడు. ఇపుడు మన యిర్వురలో నెవరియోగ్యత
యధికము?" అనఁగా, లక్ష్మి,—"సరస్వతీ! నీ యోగ్యతయే
అధికము. నీ వలననే లోకుల కందఱకును సౌఖ్యము కలిగి
యున్నది" అనెను.

12. పిమ్మట సరస్వతి, వానికి బుద్ధిని ప్రసాదించెను.
వెంటనే లక్ష్మికుమారుఁడు క్రిందుగాఁ జూచి, తన యవివేకము
నకుఁ జింతించి, గవాక్షము మూలముగా మరల లోపలికిఁ

బోయి, యా రాత్రిని సుఖముగాఁ గడపెను. మఱునాఁ డుద యమున లేచి కల్యకృత్యములు దీర్చికొని యందఱితోడను వినయముగ సంభాషించు చుండెను. ధనపాలసెట్టి, తాఁ జేసిన కార్యము దైవ యోగముచే సార్థక మైనదని భావించి సంత సించెను. ఆ రాజునకు పుత్త్రులు లేమిం జేసి యా దేశము నకు లక్ష్మీకుమారుఁడే రాజ్య పట్టాభిషిక్తుఁ డాయెను.

13. లోకమునందు విద్యయు బుద్ధియు శ్రేష్ఠము లేగాని, ఐశ్వర్యము శ్రేష్ఠము కాదు. విద్య లేనివాఁడు పశువుతో సమా నుఁడు. కాఁబట్టి విద్యను సాధింపవలయును.

గీ. జ్ఞానసిద్ధికంటెఁ జర్చింప సకల సి
ద్ధులను లొచ్చుగానఁ దొలుత దాని
గడన సేయ వలయు నెడఁపక దాన న
నూన మయిన సౌఖ్య మొందు నరుఁడు.

## 26. విద్యాగర్వము కూడదు.

పూర్వకాలంబున ఉద్దాలకుఁ డను తపస్వి యొకఁడుం డెను. అతఁడు తనపుత్త్రికను కహోళుఁ డను నతని కొసంగెను. అతఁడు ఉద్దాలకునియొద్ద విద్యాభ్యాసము చేయుచుండెను.

2. కహోళుఁడు తన భార్య గర్భవతి యైనదని యెఱింగి, ప్రసవ సమయమునకు వలయు ధనమును సంపాదింపనెంచి మిథిలానగరమునకు జనకమహారాజు కడకుఁ బోయెను. అచ్చట,

వంది యను పేరుగలవాఁడు విద్యా మదముచేత, రాజసభకు వచ్చునట్టి విద్వాంసుల నందఱను వాదమున జయించుటయే గాక, జయ మొందని వారిని కాలుసేతులు కట్టి యొక మడుగులోఁ ద్రోయుచుండెను. కహోళునకును పైవారి గతియే ప్రాప్తించెను.

3. మఱి కొన్ని దినములకు మీఁద, కహోళుని భార్య పుత్రునిం గనెను. వాఁ డెనిమిది వంకరలు గల వాఁ డైనందున వానికి ఉద్దాలకుఁడు 'అష్టావక్రుఁ' డని పేరిడి, క్రమముగా చౌలోపనయనాదులొనర్చి, విద్య నేర్పుచుండెను. అష్టావక్రుఁడు ఉద్దాలకుఁడే తన తండ్రి యని భావించి యుండినాఁడు. వీనికి పండ్రెండేండ్ల వయస్సు రాఁగా, నొకనాఁడు ఉద్దాలకుని కుమారుఁడు శ్వేతకేతువు, అష్టావక్రునిఁ జూచి, ఇతఁడు నీ తండ్రి కాఁడు, దూరముగాఁ బొమ్ము" అని కఠినముగాఁ జెప్పినాఁడు.

4. అష్టావక్రుం డీ మాటను విని, మిక్కిలి దుఃఖించి రోదనము చేయుచు తల్లి చెంత కఱిగి, "అమ్మా! నా తండ్రి యెక్కడ?" అన, ఆమె తన భర్తకు సంభవించిన స్థితినిఁ జెప్పెను.

5. వెంటనే అష్టావక్రుఁడు కోపావిష్టుఁడై, జనకమహారాజు సభకుఁ బోయి, వందిని జయింప వలయు నని సంకల్పించి, మఱి కొంతకాలము విద్యాభ్యాసము చేసి, మహాపండితుఁడై మిథిలకుఁ జని వందిని వాదమునకుఁ బిలువఁగా, వంది,

"ఈ కురూపి యగు కుఱ్ఱవాఁడా నన్ను తనతో వాదింప రాఁ గోరుచున్నాఁడు? వీఁడు నాతో సమానుఁడా?" అని యెంచి,



వానిం జూచి, "ఓ వెఱ్ఱిబాలుఁడా! కురూపీ! నీవు వాదమున

నన్నుఁ గెల్వనేర్తువా? ఏల వ్యర్థముగాఁ జావఁ బోవుచున్నాఁడవు' అని తిరస్కారముతోఁ జెప్పెను.

6. అష్టావక్రుఁడు, "అయ్యా! వయస్సుతోను రూపముతోను వాదమున కేమి సంబంధము? విద్య కదా ప్రధానము; నీవు నా వయస్సును రూపమును పరిగణింపక నాతో వాదింప రమ్ము" అనఁగా, విధిలేక, వంది అష్టావక్రునితో వాదింపఁ దొడంగెను. ఆ వాదమునందు అష్టావక్రుఁడు జయమొంది రాజును జూచి యిట్లనియె:

7. "మహాప్రభూ! అనేక పండితులను అవమానము చేసి, మడుగులోఁ ద్రోసిన వంది, నాచే జయింపఁ బడినాఁడు. అపజయము నొందినవారిని మడుగులోఁ ద్రోయుట వీనికి సమ్మతమైన పని కదా? వీఁడు విధించిన దండమునకు వీఁడు లోఁబడును గాక. ఈ పాపి విద్యాగర్వముచేఁ జంపిన పండితులలో నాతండ్రియు నొక్కఁడై యున్నాఁడు. వీని గర్వమును భంగముచేయుటకొఱకే నేను వచ్చినాఁడను. సరస్వతీదేవి కృపచేత వీనిని జయించితిని. ఇఁక వీనిని మడుగులోఁ ద్రోసి చంపుట నీ పని యగును" అనెను.

8. అష్టావక్రుని ధిక్కార వాక్యములను వినిన వంది, వడవడ వడంకి, మున్ను తాను తిరస్కారముగాఁ జూచిన, యష్టావక్రుని పదంబులపై వ్రాలి, ప్రాణదానము చేయుము, ఇఁక నేను విద్వాంసుల నవమానింపను, పెద్దలను తిరస్కరింపను,

నా తప్పును మన్నింపుము, నేఁ జేసిన క్రూరకార్యమునకు పరితపించుచున్నాఁడను" అని పలుతెఱంగుల ప్రార్థించెను.

9. గర్వభంగ మొందిన మహాపండితుఁ డగు వంది ప్రార్థన కియ్యకొని, అష్టావక్రుఁడు, "క్షాత్త్రము క్షత్త్రియ ధర్మము, క్షమించుటయే బ్రాహ్మణ ధర్మము. కావున, నీపై పగ సాధించుట నా పని కాదు. నీవు మనస్ఫూర్తిగా పశ్చాత్తాప మొందుటంబట్టి మన్నించినాఁడను" అని దయారసము లొలుక పలికెను.

10. పదంపడి వంది, అష్టావక్రుని మిక్కిలి కొనియాడి నదే గాక, మడుగులోఁ బడి మరణించిన వారలను బ్రదికింప నెంచినవాఁడై, జలాధిదేవత యగు వరుణదేవుని వినుతింపఁగా, గతించిన పండితు లందఱును సజీవులై బయటికి వచ్చిరి. అపుడు కహోళుఁడును బయట వచ్చెను.

11. కాఁబట్టి, విద్యాగర్వము కూడదు. విద్యామదము గలవారి కెన్నఁటికైన తప్పక భంగము కలుగును.

క. ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబుఁ బొనరించును స
జ్జనులైన వారి కడఁకువ
యును వినయము నవియ తెచ్చు నుర్వీనాథా.

---

## 27. పెద్దల నవమానింపరాదు.

ప్రపంచమున కాదికారణము భగవంతుఁ డనుట నందఱెఱింగిన విషయమే. భగవంతుఁ డనఁగా సకల సంపదలు గల వాఁ డని యర్థము. అయినను, అతఁడు సర్వశక్తులు గల వాఁడగుటం జేసి, ప్రథమమున, తన యిచ్ఛామాత్రంబున సర్వమును సృష్టించి, యా పిమ్మట, ప్రపంచాతీతుఁడై, యన్నిటికిని యధికారుల నియమించినాఁడు. ఎట్లన,

2. ప్రపంచమును సృష్టించుటకు బ్రహ్మదేవుని, రక్షించుటకు విష్ణువును, సంహరించుటకు రుద్రుని నియమించెను. వీరును ఇచ్చామాత్ర సృష్టి చేయునట్టి శక్తిగలవారై యున్నారు. కావున, నీ ముగ్గురును సృష్టికిని, రక్షణమునకును, సంహారమునకును తమకుఁ గావలసిన పరిజనమును పరికరములను సృజింపించి కొనిరి.

3. బ్రహ్మదేవుఁడు తనసృష్టి కార్యమునకు సహాయులను బడయఁ గోరి, మనస్సున తలంచిన మాత్రాన కొందఱు పుత్త్రులు పుట్టిరి. కావుననే వారికి బ్రహ్మమానస పుత్త్రు లని పేరు. సృష్టించు శక్తి మనస్సునకుఁ గలదు. కాఁబట్టి, ఎప్పుడును మనస్సునందు చెడ్డతలంపుల కెడమీక యుండవలయునని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి.

4. ఆ పుత్త్రులలో తొమ్మండ్రుగురు ప్రజా సృష్టి చేసి నవబ్రహ్మ లని పేర్కొనం బడిరి. 1. సనక, 2. సనందన, 3. సనత్కుమార, 4. సనత్సుజాతు లను నల్వురును, నారదుఁడు మొదలగు వారు కొందఱును సృష్టి కార్యమం దపేక్ష లేనివారై, పుట్టిన నాఁటనుండియే విరక్తి నొంది మహా జ్ఞానులైరి.

5. పరమ యోగులైన సనకాదులు నల్వురును శ్రీమ న్నారాయణమూర్తిని దర్శింప నెంచి వైకుంఠలోకంబున కేఁగిరి. అచ్చటి ద్వారమును జయుఁడు, విజయుఁడు నను వారు రక్షించు చుందురు. నారాయణుని దర్శింప వచ్చెడి వారు మహాత్ము లని యాద్వార రక్షకులకుఁ దెలియును. అందఱికంటెను సనకాదులు పరమోత్కృష్టు లనియును దెలియును. అటులుండియు, వారిని లక్ష్యపెట్టక లోపలికి పోనీక ప్రతిబంధకము చేసిరి.

6. సాధారణముగా సంస్థానములందుఁ గాని, మహా ధనికుల గృహములందుఁ గాని, అల్పమైన యుద్యోగములం దుండువారు, తమ స్థితిని మఱచి, వచ్చిన గొప్పవారిని పరిభ వించుట సర్వజన విదితమే కదా. మఱియు, వచ్చునట్టి గొప్ప వారు తమ దయ కెదురు చూచుచున్నారనియే యా యుద్యో గుల తలంపు. అది వట్టి భ్రమయే గాని వేఱు కాదు. పెద్దలను దర్శించు భాగ్యమును, ఉపచారాదులచే వారిని సత్కరించు పుణ్యమును ప్రాప్తించి యుండఁగా, అకటా! ఆ యల్పోద్యో

గస్థులు గర్వించి కఠినముగాఁ బల్కి యెంతయు లక్ష్య ముంచక ధిక్కారము చేసి, పాపమునకును, శాపమునకును పాత్రులై చెడిపోయెదరు.

7. వైకుంఠ ద్వారమునకు సనకాదులు పోయినపుడు జయ విజయులు నారాయణమూర్తి కెఱుక చేయక, "ఇపుడు దర్శింప వలనుపడదు, పొండు" అని తిరస్కరించిరి. అంత సనకాదులు, "జయ విజయులారా! మీరు ద్వారపాలకులే గాని, వైకుంఠ లోకమున కధికారులు కారు, మీరు మీ స్థితిని మఱచి గర్వముతోఁ గూడిన వారై యున్నారు. దేవతలును మునులును యోగులును వచ్చు నీ చోట మీ రుండుటకుఁ దగరు. మీరు భూలోకంబున రాక్షసులై పుట్టుదురు గాక" యని శపించి, వారు నారాయణుని దర్శించుటకై లోపలి కేఁగిరి.

8. పిమ్మట, జయవిజయులు భూమియందు రాక్షసులై జన్మించి శ్రీమహావిష్ణువునకు విరోధములైన కృత్యము లొనర్చి శిక్షింపఁబడిరి. ఈ చరిత్రము భాగవతాది పురాణంబులందుఁ గనం దగు.

9. కాఁబట్టి, ఎప్పుడుగాని పెద్దలయెడ వినయముతో వర్తించు వారు మేలొందుదురు. జయవిజయులవలె గర్వించి తమ స్థితిని మఱచి వర్తించువారు ఉద్యోగమును, స్థానమును బోఁగొట్టుకొని దుఃఖ మనుభవింతురు. పెద్దలను జూచిన

వెంటనే సత్కరింపవలయును. మహాత్ముల నవమానించువారు కష్టముల నొందుదురు.

గీ. ఆత్మజనుల కేని యన్యుల కేనియుం
జెట్టి చరిత వలనం బుట్టు ఖేద
మట్టి నడక మాని యైక మత్యముం దెచ్చు
నట్టి నడితిం బూను టర్హ మండ్రు.

---

## 28. గురుదూషణ కూడదు.

---

ఈ భరత ఖండమునందు సుమారు రెండువేలేండ్లకు ముందు బౌద్ధమతము నిక్కలి వ్యాపించియుండెను; రాజు లనేకు లామతము నవలంబించిరి. రాజులవలె ప్రజలును తన్మతస్థు లైరి. ఆ మత ప్రభావముచే దేవుండు లేదనియు, వేదము లబద్ధము లనియును వాదింపం దొడంగిరి. కాంబట్టి, ఆస్తికమత మైన యార్యమతము నానాంట క్షీణ మగుచుండెను; ఆస్తిక మత సిద్ధాంతముల నెఱింగిన వారు లేకపోయిరి.

2. చాల కాలమునుండి కాశీనగరము విద్వాంసులకు వాసస్థానమై యుండెను. పైని చెప్పిన కాలంబునందును విద్వాంసు లనేకు లచ్చట నివసించియుండిరి. ఆ విద్వాంసు లొకొక్కరి యొద్ద పెక్కండ్రు విద్యార్థులు విద్యాభ్యాసము చేయుచుండిరి. ఆ విద్యార్థు లీ కాలమునందు పాఠశాలలోం జదువు వారివలెం గాక, గురువుయొక్క గృహమందే యుండి వారికి శుశ్రూష

చేయుచుందురు. దీనికి గురుకులవాస మని చెప్పుదురు. కాశి యందు జదివినవారు మహా పండితులని ప్రఖ్యాతి నొంది వెలయుచుండిరి.

3. పైని చెప్పఁబడిన కాలములో కాశియందు బౌద్ధ పండితులు పెక్కండ్రుండిరి. ఆ కాలమునఁ జదువఁ గోరిన విద్యార్థులును వారియొద్దనే చదువవలయును. కాశ్మీరదేశవాసి యైన భట్టపాదులనెడి బ్రాహ్మణ విద్యార్థి విద్యాభివృద్ధి నిమిత్తమై కాశికింజని, యోగాచార్యుండను బౌద్ధ పండితునియొద్ద విద్యాభ్యాసము చేయుచుండెను. సాహిత్య మలవడిన యనంతరము మతగ్రంథములను, శాస్త్రగ్రంథములను జక్కఁగా నభ్యసించెను.

4. ఇట్లు గురుకులవాసము చేయుచు విద్య నభ్యసించుచుండ, నొక్కనాఁడు భట్టపాదులు గురువునకు తైలాభ్యంగనము చేయు సమయంబునందు, "దేవుఁడు కలఁడా ? ప్రపంచమున కాధారభూతుఁ డతఁడేనా ?" అను విషయమై ప్రసంగము జరిగినది.

5. ప్రపంచమున కాధారభూతుఁ డైనవాఁడు ఈశ్వరుఁడు. అతఁడే సృష్టి స్థితి సంహారములను జేయుచున్నాఁడని భట్టపాదులు వాక్రుచ్చెను. గురువు 'నీవు చెప్పునది సరికా'దని ఖండితముగాఁ జెప్పెను. గురువు చెప్పిన వితండావాదమును విని భట్టపాదు లోర్వక మిక్కిలి చింతించి కన్నీరు నించెను.

ఆ కన్నీటి బిందువు గురువు తొడపైఁ బడెను. వేఁడినీటి బిందువువలెఁ బడెను. అపుడు గురువు తలయెత్తి శిష్యునిఁజూచి, వారి యభిప్రాయంబును దెలిసికొని, వారికి సమాధానము చేయనెంచి, తాఁ జెప్పిన వాదమును సిద్ధాంతీకరించుటకై యనేక యుక్తులను దెలియఁజేసెను. అయినను, భట్టపాదులు గురువు చెప్పిన యుక్తుల కన్నిటికిని ప్రత్యుక్తులను జెప్పి, గురువునకు మనోవేదనము కల్గునట్లు ఖండించెను.

6. పిమ్మట, భట్టపాదులు కాశ్మీరదేశమునకుం జని, శిష్యులకు శాస్త్రపాఠములను జెప్పెను. ఆయన శిష్యులలో మండనమిశ్రు లనువారు మహా సమర్థత గలవాఁడుగ నుండెను. కొన్ని దినంబులకు భట్టపాదులకు, తాను మున్ను గురుధిక్కారము చేసిన విషయము జ్ఞప్తికి వచ్చెను. అపు డతఁడు, "నేను గురువుతో వాదము చేయు కాలంబునందు వారిని దూషణ వాక్యములచే పరిభవించితిని. అది మహాదోషము. కావున, దానికి ప్రాయశ్చిత్తము చేసికొనవలయును; అందులకు తుషాగ్నిప్రవేశమే తగినది" అని నిశ్చయించెను.

7. తుషాగ్ని ప్రవేశ మనఁగా, పల్లము త్రవ్వి, యందు ఊముకను బోసి నిప్పునుంచి దానిపై కూరుచుండి శరీర వేదనము ననుభవించుచు ప్రాణములను బోగొట్టుకొనుట. ఇట్టి కఠిన ప్రాయశ్చిత్తమే గురుదూషణకుఁ దగినదని నిష్కర్షము చేసికొని, యట్లే మఱునాఁడు కావించుకొనెను.

8. భట్టపాదు లిట్టి స్థితియం దుండునపుడు, జగద్గురువు లగు శంకరాచార్యులవారు, మహా విద్వాంసుఁడైన భట్టపాదు లను దర్శింపనెంచి యతని యొద్దకుఁజని, యతనిం గాంచి, "పండితోత్తమా! శ్రీ వేదవ్యాసులవారు రచియించిన బ్రహ్మ సూత్రములకు భాష్యమొనర్చితిని. దానిని మీరాలోకింప ప్రార్థించెద" ననిరి.

9. భట్టపాదులు, "గురూత్తమా! స్వాగతము, నేను తుషాగ్నియందు ప్రవేశించి యుండుట ప్రత్యక్షమే కదా? ఇఁక క్షణకాలములో నా ప్రాణములు పోనున్నవి. కావున, నేను ఈ సమయమునందు మీ గ్రంథము నెట్లు వినఁగల వాఁడను" అనెను.

10. అపుడు శంకరాచార్యులు, "అయ్యా! నేను నా కమండలు జలంబులం బ్రోక్షించి యగ్నినిఁ జల్లార్చెద. మీరు లేచి రండు. మఱియు మహాజ్ఞానులగు మీ కిట్టి దేహ దండము తగదు" అనెను.

11. భట్టపాదులు, "స్వామీ! మీ యనుగ్రహముచే ధన్యుఁడ నైతిని. నే నొకప్పుడు క్రూరవాక్యములచే గురువును తిరస్కరించితిని. ఆ పాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్తమును జేసికొంటిని. గురుదూషణము పంచమహాపాతకములలో నొక్కటికదా. కాఁబట్టి, ఈదండమునుండి తప్పింపకుండ చేయ వలయు నని ప్రార్థించెదను. మఱియు, తమ భాష్యమును

వినుటకుఁ దగినవాఁడు నా యంతటివాఁడు నాశిష్యుఁడు మండ
నమిశ్రుఁ డనువాఁ డున్నాఁడు, మీరు అతని కడకుఁ బొండు”
అనెను.

12. అనంతరము శంకరాచార్యులవారు మండనమిశ్రుల యొద్దకుఁ బోయిరి. వారు పోయిన కొంతసేపటికి భట్టపాదుల శరీరము భస్మమయ్యెను. భట్టపాదులు తన గురువులతో వాదించిన విషయము వాస్తవమే యైనను, అతనిం దూషించి నందున నిట్టి ప్రాయశ్చిత్తమును జేసికొనెను. గురువుయొక్క మనస్సునకు సంతాపమును గలుగఁ జేయరాదని మనవారి యభిప్రాయము.

క. గురువునకు మాఱు పలికినఁ
బొరసిన కల్మషము వాసి పోవు నతనికిన్
బరితోషముగా వినయపు
తెరవున నుపహార మిచ్చి వినతుం డైనన్.

## 29. అమితముగ భుజింపఁగూడదు.

ఆహారము ఆఁకలిని దీర్చికొనుటకే గాని వేఱుకాదు. ఆఁకలి యనునది, శరీరమును రక్షించి కొనుటకుఁ దగిన సాధనము కొఱఁతపడి యుండుటను దెలుపునట్టి రోగము. ఆ రోగమును పరిహరించుటకుఁ దగిన యాహారము నెంతమాత్రము స్వీకరింపవలయునో, అంతమాత్రమే స్వీకరింపవలయును గాని, అధికముగా స్వీకరింపఁ దగదు.

2. ఆ పరిమాణ మెట్లు తెలియు ననఁగా, దానిని దెలిసికొనుటకు మనయొక్క అన్నకోశమే పరిమాణమై యున్నది. తనకు వలసినంత యాహారము లభించిన వెంటనే, అన్నకోశము " ఇఁక వలదు " అని మనకు హెచ్చరిక చేయు చున్నది. ఆ హెచ్చరికను లక్ష్యపెట్టక అధికముగా భుజించిన యెడల అన్నకోశము కొంచెము విరివియై స్థల మొసఁగు చున్నది. మఱియు, అపరిమితముగా భుజించినయెడల " ఇఁక స్థలము లేదు" అని తెలియఁజేయుచున్నదో యనునట్లు వమనము చేయుచున్నది.

3. అధికముగ భుజించినయెడల, దానిని జీర్ణము చేసికొనుటకు అధిక రక్తము కావలయును. అపుడు శరీరమందలి యితరావయవములయం దుండు రక్తము జీర్ణకోశమునకుఁ బోవుచుండును. ఇందువలన మెదడునందు రక్తప్రవాహము తగ్గిపోవును. మెదడునందు రక్తప్రవాహము తగ్గనేని అది పని చేయదు. ఈ కారణముచేత, అమితభోజనము ఆయాసమును గలుగఁజేయుచున్నది. మఱియు బుద్ధిమాంద్యమును, పలువిధములగు వ్యాధులను గలుగఁజేయును.

4. శరీరమునకు అమితాహార మెట్లు పనికిరాదో అట్లే ఆహారము కొఱఁతయైనను, శరీరము ప్రయోజనపడదు. అనఁగా ఆహారము కొఱఁత యైనచో శరీరము నిలకొని యుండుటకుఁ దగిన సాధనమును కొఱఁతవడును. అట్టి కొఱఁతను రానీక

చేయుకార్యము రక్తనాళములతో సంబంధించినది. అవి తమ కార్యమును నెఱవేర్చు నిమిత్తము, శరీరమందలి యితరావయవములలో నుండెడి రక్తమును గ్రహించుచున్నది. ఇట్లు గ్రహించుటం జేసి శరీరము కృశమై, బలము చెడి, ఆయాసమధికమై వ్యాధి ప్రారంభించుచున్నది. కాఁబట్టి, అమితాహారమును, అల్పాహారమును వ్యాధిని కలుగఁజేయును.

5. వ్యాధి రాకయుండుటకుఁ దగినట్లు భుజించుట యెట్లన, మితముగా భుజించుటయే. మితాహార లక్షణమును గూర్చి భగవద్గీతయందు, ఇట్లు చెప్పఁబడి యున్నది — అర కడుపు అన్నమును, కాలు కడుపు జలమును, వాయు సంచారమునకై కాలు కడుపు ఉత్తదిగను నుండవలయును. దీని ననుసరించియే హిందీభాషయం దొక సామెత వాఁడఁబడు చున్నది. ఎట్లన —

హాంఖు హల్తా దాంత్ కు లోణ్
బుక్కా రక్ఖో చాదా కోణ్.

అనఁగా, "ఆరోగ్యము గోరుదువేని, నేత్రమునకు కరక్కాయను వేయుము. ఉప్పుతో పండ్లను తోముము. కడుపు నందు నాలుగింట నొక భాగము ఉత్తదిగ నుంచుము."

6. కాళిదాస మహాకవి, "ఆరోగ్యవంతు లెవరు?" అను ప్రశ్న కుత్తరము చెప్పెడి సమయమునందు, ఇట్లని చెప్పెను:—

హితమితభుక్ భుక్త్వాంతే కృత చంక్రమణః క్రమేణ వామశయః
ఽధృత మూత్ర పురీషః స్త్రీషు జితాత్మా పతంగవర సోరుక్.

అనఁగా, "ఆఁకలి గొన్నప్పుడు ఆరోగ్య ప్రదమైనది యును, మితమైనదియు నగు ఆహారమును భుజింపవలయును, అనంతరము కొంత దూరము నడవవలయును. ఎడమ ప్రక్కను పరుండవలయును; మలమూత్రములను బంధింపక విసర్జింపవల యును. స్త్రీలోలుఁడై యుండఁగూడదు. ఇట్లుండువాఁడే ఆరోగ్యవంతుఁడు."

7. ఇంతవఱకు మితాహారమునుగూర్చి తెలిసికొంటిమి. ఇఁక హితమైన యాహారమును గూర్చి విచారింతము. హిత మనఁగా భుజించువారికి ప్రియమైన యాహారము. ప్రియములేని యాహారమును స్వీకరించినచో మనస్సున కాయాసము కల్గును. ఆయాసము మూలముగా విపరీతమైనవ్యాధులు సంభవించును. కాఁబట్టి, ప్రియమైన యాహారమే ఆరోగ్య ప్రదమును పుష్టి ప్రదము నైనది. ప్రియమైన యాహార మిట్టిదని కనుఁగొనుటకు సాధనము మనయొక్క నాలుకయే.

8. అమితముగ భుజించిన యెడల, అజీర్ణ రోగము కల్గును. దానిని నివృత్తిచేసికొనుటకు మిక్కిలి ప్రయాస పడ వలయును. ఈ విషయమును గూర్చి మహాభారతమం దొక యితిహాసము కలదు. అది యెట్లన,

9. పూర్వకాలమునందు శ్వేతకి యనెడి మహారాజు అనేకము లైన యాగములను జేసెను. దేవతల సంతుష్టికొఱకు

యాగ సమయములయందు అగ్నియందు అన్నమును హోమముచేయుట కలదు. అగ్నియందుంచెడి అన్నము హవిస్సన



బడును. అగ్ని, అమితముగా హవిస్సును గ్రహించి భుజించినందున నతనికి అజీర్ణరోగము సంభవించి కడుపుబ్బ నారంభించెను.

అది క్రమముగా తాటికాయయంతదై, టెంకాయయంతదై, గుమ్మడికాయ యంతదై, కడవ యంతదై, తుదకు భేరి యంత దైనది. ముఖము తెల్లబాఱెను. నిరంతరము పులి త్రేనుపులు వచ్చుచుండెను. ఇఁక చేయఁగల యాగములయందు హావిస్సును స్వీకరించుటకు అగ్నిదేవునకు శక్తిలేక పోయెను.

10. పిమ్మట అగ్నిదేవుఁడు దేవ వైద్యులగు అశ్వీదేవతల కడ కేఁగి, తన రోగమునకుఁ దగిన యౌషధము నీయవలయు నని వేఁడఁగా వారలిట్లనిరి—"ఈ రోగమును బోఁగొట్టుటకుఁ దగిన యౌషధము దేవేంద్రుని ఖాండవవనంబునం దున్నది. దానిని సేవించి రోగవిముక్తిఁ బడయుము" అన, అగ్నిదేవుఁ డచ్చట నుండి ఖాండవవనంబును బ్రవేశించెను. అతఁ డగ్ని కావున, నతఁడు ప్రవేశించిన మాత్రమున నవ్వనంబు రగుల నారంభించెను. అంత దేవేంద్రుఁడు వర్షమును గురియించి తన వనంబును చల్లార్చెను. ఇట్లు కొన్ని పర్యాయములు జరిగెను.

11. అంత, అగ్నిదేవుఁడు బ్రాహ్మణ వేషమునుదాల్చి, కృష్ణార్జునుల కడకుం జని, "మహాశయులారా! నే నాఁకలి గొని వచ్చినాఁడను. నాకు వలయు భోజనము నొసంగవలయు నని వేఁడుచున్నాఁడ" ననెను. అర్జునుఁడు, "మీ కెట్టి భోజనము వలయునో చెప్పినచో నారీతిగా భోజన మొసంగెదను, చెప్పుము" అనెను. వెంటనే అగ్నిదేవుఁడు నిజరూపమును దాల్చి, "నేను అగ్నిదేవుఁడను. నాకు అజీర్ణరోగము సంభ

వించియున్నది. దానిని నివృత్తి చేయునట్టి యౌషధము ఖాండవ వనంబునం దున్నది. నీవా వనంబును నా కాహారంబుగ నిప్పించ వలయును" అనెను.

12. అర్జునుఁడు, అగ్నిదేవునిఁ జూచి, "నీవు ఖాండవ వనంబుఁ జొచ్చి నీ యిష్టము చొప్పున భుజింపుము" అని చెప్పఁగా, అగ్నిదేవుఁ డావనంబుఁ జొచ్చినంత, అది రగుల నారంభించెను. ఇంద్రుఁడు ప్రళయకాల వర్షమువలె వర్షము కురియించెను. ఆ వర్ష ధారలు ఖాండవ వనంబుమీఁదఁ బడక యుండునట్లు అర్జునుఁడు శరంబులం బ్రయోగించి శరపంజరము నిర్మించెను. అగ్నిదేవుఁడు ఖాండవ వనంబును దహించి తన రోగమును బాపికొనియె. ఈ యుపకారము చేసినందులకై యగ్నిదేవుఁడు, అర్జునునకు గాండీవమను ధనుస్సును అగ్నిరథ మనెడి రథమును బహుమాన మొసంగెను.

'రుచియని చాల తినరాదు'

అని మన పెద్దలు చెప్పిన వాక్యమును జ్ఞప్తియందుంచుకొని, హితముగను మితముగను భోజనము చేయవలయును. 'అమిత మైనచో నమృతమును విషమగును.'

అమితముగ భుజించువారి కారోగ్యము లేదు.

ఆఁకలిగొనక భుజించువారి కాయువు క్షీణించును.

ఆఁకలిగొనినప్పుడు భుజింపుము.

వేకువ లేచి పనిచేయుము.

---

## 30. దురాలోచన చేయఁగూడదు.

త్రేతాయుగమునందు అంబరీషుఁ డను రాజొకఁ డుండెను. అతఁడు విష్ణుభక్తి కలవాఁడు. అతనికి వేదవతియను కొమార్తె కలదు. ఆమె అతిరూపవతియు గుణవతియునై యుండెను.

2. పర్వతుఁ డనియు నారదుఁ డనియు పేర్లుగల అన్నదమ్ము లిద్దఱు బ్రహ్మచారులు అంబరీష మహారాజు కడకుఁ బోయిరి. అతఁడా బ్రహ్మచారులకు అర్ఘ్యపాద్యము లిచ్చి ఆసన మొసంగి సత్కరించి వారి రాకకు సంతోషించి వారినిఁ జూచి, "మీకుఁ నావలనఁ గావలసిన దెయ్యది?" యని యడిగెను.

3. బ్రహ్మచారులు, "మహారాజా! నీవు ధర్మాత్ముఁడవు. నీ కీర్తి జగద్విదితము. నీ యాశ్రమమున నొక సంవత్సరము తపస్సు చేయవలయు ననియును, మా యనుష్ఠానములకు కొఱంత లేక నీవు రక్షింతువనియును నమ్మి వచ్చితిమి" అనిరి.

4. అంబరీషుఁడు, బ్రహ్మచారులను జూచి, "మీరు తపస్సు చేసికొనుటకుఁ దగిన యనుకూల్యముల నొనఁగూర్చు నట్టి భాగ్యము కలిగినందుల కానందించుచున్నాఁడను. మీ రెన్నాళ్లయిన నుండవచ్చును. నా యుద్యాన వనంబునందు మీరు వసియించి తపస్సు చేయుచుండుఁడు" అని చెప్పి, వారికి వలయు వాని నంతయు నొసంగి సత్కరించుచుండెను.

5. తపస్సు చేయువారు గురుసాన్నిధ్యమందుఁ గానిఁ లేక, మఠమునఁ గాని, లేక, తపస్సు చేయువారి సమీపమున గాని వసించి తపస్సు చేయుటయే క్రమమైన మార్గము. తపస్సు చేయువారల కట్టి సత్సంగము లేకపోవునేని మనస్సు స్థిరపడదు. సత్సంగమే మహా తపస్సగును. అదియే శ్రేష్ఠమైన సన్న్యాసమగును. కాఁబట్టియే 'సాధు సంగంబు సకలార్థసాధకంబు' అని పెద్దలు వక్కాణించిరి.

6. ఈ బ్రహ్మచారులు, అట్టి క్రమమైన మార్గము నవలంబింపక, తమంతట నొకచోటనుండి మనస్సును నిగ్రహించి, యింద్రియ జయంబు వడయ నెంచి, తపస్సు చేయం బూనినది యెంతయుఁ దగదు. ఈ బ్రహ్మచారులు ఉద్యాన వనంబుననుండి యొక సంవత్సరము తపస్సు చేసిన పిమ్మట, రాజునొద్దకేఁగి యనుమతిఁనొంది పోవునపుడు, రాజు వారినిఁజూచి, "ఇఁక మీ రెచ్చోటికిఁ బోవుటకు నిశ్చయించితిరి?" అని యడిగెను.

7. "ఇఁక మేము గృహస్థాశ్రమము స్వీకరింపఁ బోవుచున్నారము. మీకొక కన్యక కలదని తెలియుచున్నది. ఆమెను మాకు పాణిగ్రహణ మొనర్చి యిచ్చిన సంతసించెదము" అని చెప్పఁగా, రాజు, "విప్రులారా! మేము క్షత్త్రియులము. మా కులధర్మప్రకారము స్వయంవరము చాటింపఁ బడును. అపుడు కన్యక యెవనిని వరించునో వాఁడే యామెకు పతియగును. ఆ ముహూర్తమునకు మీరును రండు" అనెను.

8. ఆ బ్రహ్మచారులు గురుశిక్షయు, సత్సహవాసమును లేనివారై నందున, వారిమనస్సు నిర్మలము గాకుండెను. కావున, తన తమ్ముఁడగు నారదునియందు వేదవతికి మక్కువ గలుగక యుండవలయునని పర్వతుఁడును, తన యన్నయందు ప్రేమ గలుగక యుండవలయునని నారదుఁడును తలంచెను.

9. ఇట్లు ఆ యన్నదమ్ము లిర్వురును తలంచిన వారై, పరస్పరము తమ్ముని మొగము కోఁతి మొగము కావలయునని అన్నయును, అన్న మొగము కోఁతి మొగము కావలయునని తమ్ముఁడును గోరి తపస్సు చేయందొడంగిరి. వారి కోర్కులు సిద్ధించెను. పిమ్మట, వేదవతి స్వయంవరమును విని, వీరిర్వును వచ్చిరి.

10. వేదవతిని వరింపనెంచి వచ్చిన రాజకుమారులతోఁ బాటు పర్వత నారదులును ఆసీనోపవిష్టులై యుండిరి. వేదవతి కోఁతిమూఁతి మనుష్యులను జూచి యాశ్చర్యమొంది తనలో నవ్వుచు వారున్న దిశ కేనిపోవక, తనకు సమ్మతమైన వానిని వరించెను.

11. ఇట్లు, పరస్పరము దురాలోచనము చేసినందున పర్వత నారదులు మేలొందరైరి. ఎప్పుడును పరులమేలు గోరువారు మాత్రమే సుఖ మనుభవింతురుగాని, కీడు గోరు వారు తప్పక దుఃఖ మనుభవింతు రని యీ చరిత్రమువలన

బోధ మయ్యెడిని. కావున, "చెడ్డతలంపుగలవాఁడు చెడిపోవును" అను సామెతను మఱవరాదు.

గీ. వినుము దీర్ఘ వైరవృత్తియు ద్రోహచిం
తనములేక వాక్కు మనము నొక్క
చందమగుట సకల జనములకును బుద్ధి
సంపదాప్తి పరమ సాధనంబు.

## 31. ప్రాణిహింస చేయకుము

పూర్వకాలమునందు గౌతమియను ఋషిపత్ని యొక్కర్తుక మిగుల ధర్మాత్మురాలై యుండెను. ఒక్క నాఁ డామె కుమారుఁడు సమిత్కుశ ఫలార్థియై వనంబునకుఁ బోయి యుండెను. అచ్చట మిక్కిలి జొంపముగఁ బెరిఁగియున్న దర్భలను గోయుచుండఁగా, నందు దాఁగియున్న సర్పము ఋషికుమారునిఁ గఱువఁగా వాఁడు కొంతసేపటికంతయు ప్రాణములం దొరంగెను.

2. అచ్చటికి సమీపమునఁ బోవుచున్న వేఁటరి యొక్కఁడు, పాముచేఁ గఱువంబడి మృతినొందిన ఋషికుమారునిగాంచి చింతించెను. పిమ్మట, ఆ కఱచిన పామును జూచి, కుపితుఁడై, దానింబట్టుకొని వాని తల్లికడకుఁ బోయి, "తల్లీ! దర్భగోయుచున్న నీ కొమరుని, ఈపాము గఱచినందున వాఁడు గతాసుఁడయ్యె. వాని స్థితినింగని యోర్వక దీనింబట్టి తెచ్చితిని.

నీ వసుమతి నిచ్చితివేని దీనిం బరిమార్తును. మఱియు నీ క్రూర సర్పమును నిప్పుడె గాల్చిన నింకను మంచిదే" యనెను.

3. ఇట్లు వేటకాఁడు పల్కిన పల్కులు విని గౌతమి మిక్కిలి చింతించి, "అయ్యా, వ్యాధుఁడా! ఈ సర్పమును వధించుటచే నేమి ప్రయోజనము? దీనిం జంపితిమేని ప్రాణములం గోల్పోయిన వాఁడు బ్రదుకుట లేదు. గాని, నరకము మాత్రము తప్పక సిద్ధించును. కాఁబట్టి యీ పామును విడిచి పెట్టుము. ప్రాణిహింస పాతకమునకు మూలము. దీనికంటె మహాదోషము వేఱేదియు లేదు" అని చెప్పినది.

4. ప్రాణిహింస చేయవలదనియు అది మహాదోష మనియు వచించిన ఋషిపత్ని వాక్యములను వినిన వేటరి, "తల్లీ! మీరు తపస్సంపన్నులరు. ఇట్టి మహాపరాధము లను క్షమింపఁ గల దయాగుణ పరిపూర్ణులు. అయినను, ఈ విధమైన దుష్టజంతువులను జంపుటచేత లోకుల కుప కార మగును గదా?" యన, ఆమె, "క్రూర జంతువులు తమ్ము సమీపించిన పదార్థములను కఱచుటయు పొడుచుటయు స్వభావము. మనవలె నా జంతువులకును రోషావేశము కలదు. కొన్ని జంతువులు తమ స్వభావానుగుణముగ కఱచినపుడు మనకుఁ గెడుగు సంభవించుచున్నది. ఇంత మాత్రముచే నా జంతువులు చెడుగు చేయునవి యని తలంపఁదగఁదు. మఱియు, ఇతర పదార్థములకుఁ జెడుగు సంభవించుట లేదు కదా? కాఁబట్టి, ప్రాణిహింస చేయరాదు"అని సమాధానము చేసెను.

5. దుష్ట జంతువులు మనలను కఱచినప్పటికిని వానిని చంపఁగూడదని బోధించిన ఋషిపత్ని వాక్యములను విని, ఇఁక నీమో దీనిం జంపుట కంగీకరింప దని నిశ్చయించి, యా వేఁటకాఁడు, పామును వదలిపెట్టి తన దారినిఁ బోయెను.

క. సమదర్శులై యఖిల భూ
తములను దనయట్ల గాఁగఁదలఁచుచు నెవ్వం
డమలన్యాయ పరుండగు
నమరు లతని వందనీయుఁ డండ్రు నరేంద్రా !

---

## 32. ప్రాణులయెడ ప్రేమనుంపుము

---

వయస్సునకుఁ దగినట్లు శిశువుల మనస్సు విశాలమగుచు నుండును. మొట్టమొదట శిశువునకు తనయందే ప్రేమ యుండును. కొంచెము ఎదిగినమీఁద తెలుచుగాఁ జూచుచుండు నట్టి తన కుటుంబము వారియెడ ప్రీతి హెచ్చుగా నుండును. పాఠశాలకుఁ బోయి యచ్చటి వారితో మెలఁగుచుండు కాల మునందు, తనతోఁగూడఁ జదువుచుండు తోడి బాలురయందు ప్రేమ నుంచుచున్నాఁడు. అనంతరము తన గ్రామస్థులపై అభిమానము నుంచుచున్నాఁడు.

2. యుక్తవయస్సు వచ్చినపుడు వాఁడు తన దేశస్థు లందఱియందును అభిమానమునుంచుచున్నాఁడు. ఇట్లు వాఁడు తనవలెనుండు మనుష్యులు మాత్రమే ప్రేమ పాత్రము లని

తలంచుచున్నాడేగాని, పశుపక్ష్యాదులు కూడ ప్రేమింపఁ దగిన ప్రాణులని తలంచుటలేదు. మనుష్యులవలెనే పశుపక్ష్యాది జంతువులును మాతృగర్భమునుండి జనియించి పెరిఁగి గతించునవి యని వాని బుద్ధికి గోచరించుటకు చాల కాలముపట్టును.

3. ఇట్టి తలంపు వానికి కలుగునంత వఱకును, వాఁడు తన శక్తినంతయు నోరులేని పశ్వాదులయం దుపయోగించి వానిని హింసించుట కవకాశము కలదు. అయినను, వానికి బాల్యమునుండియే జంతుహింస చేయకుండునట్లును, జంతువుల యెడ పశ్చాత్తాపము కలిగి వర్తించునట్లును తలిదండ్రులు బోధింప వలసినది. మఱియు ఉపాధ్యాయులు బాలురకు ఈ విషయమును మనస్సున నాటునట్లు బోధింప వలయును.

4. మనము, ప్రీతితోఁ గాపాడునట్టి ప్రాణులు కొన్ని గలవు. అనఁగా కుక్క, జింక, చిలుక, గోరవంక మొదలగునవి. ఈ జంతువులను మనము మిక్కిలి ప్రేమముతోఁ బోషించుచున్నారము. మఱియు, ఆ జంతువులు వసించుటకును శయనించుటకును దగిన యేర్పాటులను జేయుచున్నాము.

5. అపూర్వమైన జంతువులను మాత్రమే గాక, మన యుపయోగము కొఱకును గొన్ని జంతువులను బోషించుచున్నాము. అనఁగా గుఱ్ఱము, ఎద్దు, గాడిద మొదలగునవి. మన కాహారము నొసంగఁదగిన జంతువులను సైతము కాపాడెదము. అనఁగా ఆవు, ఎనుము, మేఁక మొదలగునవి. ఇట్టి

జంతువులవలన మనకు వలయు సదుపాయములను మాత్రము బొందుచు, వానికిఁ దగిన యాహారమును, జలమును, వసించుటకుఁ దగిన స్థలము నీయకుండుటయును, వాని యారోగ్యము నందు లక్ష్యము నుంచక పోవుటయును మనకుఁ దగదు.

6. మఱియు, అడవులయందును బహిః ప్రదేశముల యందును అనేక జంతువులు కలవు. వానితో మన కావశ్య మేమియు లేదు. అయినను, అవి మనకక్కఱకురాని జంతువు లని హింసింపవచ్చునా? మనము వానిని హింసించుటకుఁ గారణము లేదు. కొందఱు దుష్టబాలురు కప్ప, గువ్వ, తొండ, చీమ, మిడుత, తూనిఁగ, పిల్లి, కుక్క మొదలగు జంతువులను హింసించుచున్నారు. అట్లు చేయుట తగనిపని; మంచి బాలురు హింసింపరు. మఱియు, పైని చెప్పఁబడిన జంతువుల మీఁద రాలురువ్వుట, కొట్టుట, మెడకు దారముకట్టి లాగుట, చంపుట, ఇవి మహాదోషములని తెలిసి వర్జింప వలయును.

7. ఏ జంతువునకైనను చెడుగు చేయరాదు. మనతో నెదిరించి జగడము చేయలేని జంతువులపై మత్సర మేల? వానిని హింసించుట మగతన మగునా? సన్మార్గులెప్పుడును జంతుహింసను జూచిరేని మిక్కిలి పరితపింతురు. దేవుఁడు సైతము పరితపించును.

8. కావున, బాలు రందఱును ప్రాణులయెడ ప్రేమ నుంచి వానిపై కనికరము గలవారై యుండవలయును.

క. భూతముల కలుగు నతనికి । భూతము లఖిలములు నలుగు భూతహితార్థి
భూతతతి కభయమిచ్చిన।భూతాత్మున కభయమిచ్చు భూతావలియుఁ॥

## 33. సన్మార్గము.

ఎప్పుడును మర్యాదగా మాటలాడుము. ఇతరుల నేదేని యడుగవలసి వచ్చినపుడు 'దయచేయుఁడు' అని యడుగుము.

2. వీథిలో నడచునపుడు నిదానించి నడువుము. నీ ఉపాధ్యాయుఁడు, మతాచార్యుఁడు, యజమానుఁడు మొదలగు వారిని జూచితివేని, వారికి నమ్రతతో నమస్కరింపుము.

3. మార్గమున నీకంటె పెద్దవాండ్రు పోవునపుడు వారిని సుఖముగ పోవునట్లు దారి వదలి పిమ్మట నీవు నడువ వలయును.

4. శుభ్రమైన వస్త్రములను ధరియింపుము. అది క్రమముగా నున్న చాలును. శ్రేష్ఠమైనదిగ నుండవలయు ననెడి నియమము లేదు.

5. శరీరమునందు మురికి చేరనీక ప్రతి నిత్యమును చక్కఁగా తోమి స్నానము చేయుము. చేతులు కాళ్లు మొగము అను నీ మూఁడును ఎచ్చోటికి పోయినను శుద్ధముగా నుంచి కొనుము. శరీర మాద్యంతమును శుభ్రముగ నుండవలయునని ఆరోగ్యశాస్త్ర ముద్ఘోషించుచున్నది. ఈ పద్ధతి నవలంబించిన ఆరోగ్య మధికరించును.

6. చెప్పిన పనిని వెంటనే చేయుము. రెండవమాఱు చెప్పునట్లు నడుచుకొనకుము.

7. నిన్నెట్లు ఇతరులు గౌరవింపవలయునని తలంచెదవో, నీవును ఆలాగున నితరులను గౌరవింపుము.

8. ఎవ్వరికిని ఆయాసమును కలుగఁ జేయకుము. పరులను పరిహసించుట మహాపాతకము.

9. ఎల్లరయెడ ప్రీతితోను విధేయతతోను వ్యవహరింపుము. మర్యాద లేనిమాట లాడఁగూడదు.

10. దేవునిమీఁదను పెద్దలమీఁదను ఆనపెట్టి మాటలాడవలదు. అసభ్యముగ మాటలాడువారును, దుర్వార్తలను పల్కువారును అయోగ్యులని తెలిసి, తొలఁగి చనుము. పాఠశాలలోను, వీథులలోను, ఇంటిలోను, అన్నిచోటులలోను చెడ్డ మాట లాడకుము.

11. ఒక్కొక వస్తువునకును ఒక్కొక స్థలమును నిర్దేశించికొనుము. ఒక్కొక వస్తువును దానిదాని స్థానములలో నుంచుము.

12. ఒంటరిగా నుండినను నుండవచ్చునుగాని, దుర్మార్గులతో మాత్రము చేరియుండఁ దగదు.

13. క్రమమైన కార్యమును చేయుము. నీవు చేయఁదగిన పని చేయుటకు ప్రతిఫలము కోరవలదు.

14. ఏ చోటను నీవు పరోపకారిగా నుండవలయును. అందును, నీవు నీ యింటివారికి ముఖ్యముగా ఉపకారము చేయుము.

15. ఏ కాలమునం దేకార్యము చేయవలయునో, ఆకాలమునం దాకార్యమును జేయుము. ఎంతటి అల్పకార్యమును

గాని చక్కఁగాఁ జేయుము. చేయవలసినదని యేర్పడిన పనులన్నియుఁ జక్కఁగాఁ జేయవలసిన వేళను నెఱుఁగుము.

16. ఎప్పుడును నిజము పలుకుము. అబద్ధమాడుట దోషము. అబద్ధమాడువాని నెవ్వరును నమ్మరు. అబద్ధమాడు స్వభావము గలవాఁడు నిజము చెప్పినప్పటికిని ఎవ్వరును నమ్మరు.

17. సంపదగలిగి మనుటకంటె తృప్తిగల్గి మనుట మేలు. మనశ్చాంచల్యముతో మహా సౌధమున వసించుటకంటెను, తృప్తితోఁ గుడిసెలో వసించుట శ్రేష్ఠము.

18. పరుల ధనమును గోరకుము. నీ ధనమునందెంత జాగ్రత్తగ నుందువో, అంత జాగ్రత్తతో నితరుల ధనమునందు నుండుము.

19. తలిదండ్రులకు విధేయుఁడవై యుండుము; వారి మాటను జవదాఁటరాదు. వారు చెప్పిన పనిని వెంటనే చేయుము.

20. భగవంతుని ధ్యానింపుము; పరులయెడ ప్రీతి నుంపుము.

21. తల్లి, తండ్రి, గురువు, దైవము, రాజు వీరియందు భక్తి కలిగి వర్తింపుము; రాజాజ్ఞను మీఱరాదు.

సన్మార్గము సకలశ్రేయములకు మూలము.



Printed at the India Printing Works, Madras.—[illegible]21